# భక్తియోగము



శ్రీ వివేకానంద ప్రవచనము



అనువాదకుడు:

చిరంతనానంద స్వామి



శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు, మదరాసు

మద్రాసు శ్రీ రామకృష్ణ మఠాధ్యక్షునిచే
ప్రకటింపబడినది.

సర్వస్వామ్యసంకలితము
తృతీయ ముద్రణము

వెల: రూ. 1-0-

లిబర్టీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడినది.

2200-11-4

# తొలి పలుకు



భగవత్ప్రాప్తి కనువగు వివిధమార్గములలో అత్యంత సరళము, స్వాభావికము నగునది భక్తిమార్గము. అట్టి భక్తి మార్గము నిందు శ్రీ వివేకానందయతిచంద్రునివాగమృత చంద్రికలు సుప్రకాశిత మొనర్చుచున్నవి. శ్రీ వివేకానందస్వామి దేశభక్తులకు మేలుబంతి; దేశికభక్తులకు తలమానికము; హరి సర్వభూతమయుడు కావున జీవారాధనమే దైవారాధనమని దీన నారాయణుల, నజ్ఞాననారాయణుల, నార్తనారాయణుల నర్చించు శ్రీ రామకృష్ణమత సేవాశ్రమములను దేశదేశాంతరములలో స్థాపించిన పరమభాగవతోత్తముడు. స్వామివాక్యము లగుటయే ఈ గ్రంథప్రాశస్త్యమును వెల్లడించును. ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని అమోఘవచనములలో, విమర్శకదృష్టితో, శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వము నీ యుపన్యాసములలో స్వామి విపులముగా ప్రదర్శించియున్నాడు. జగద్వ్యాప్తమగు నాంగ్లభాషలో నున్న యిట్టి దివ్యోపదేశములను అనువదించుట కర్తవ్యము గదా.

శ్రీ వివేకానందస్వామి యోగప్రవచనములలో రాజయోగముయొక్క అనువాదము నా ప్రథమ ప్రయత్నము. ఇది నా ద్వితీయయత్నము. పాఠకులు స్వామిభావములను బాగుగా గ్రహించుటకు దోడ్పడుటకై మూలగ్రంథములనుండి ప్రమాణ

వచనములను జూపుచు ఆవశ్యకమని తోచిన తావులందు టిప్ప ణులను వ్రాసియున్నాను. సరళము, సులభమునగు శైలి నవలం బింప యత్నించియున్నాను.

భాషాంతరీకరణ విధానమునుగూర్చి యిట నొకటి రెండు విషయములను జెప్పవలసియున్నది. భాషాంతరీకరణము ఛాయా గ్రహణమువంటిది కాదు; మూలము ననుసరింపని నూతననిర్మా ణమును గాదు. భాషాంతరీకరణము నిర్మాణ కౌశలముతో నొప్పు చిత్రలేఖనమువంటిది. భాషయందలి జాతీయరీతులను పాటించు నట్టి రసోచితములగు మాటలతో గూడిన భావప్రకటనమే భాషాంతరీకరణమునకు ప్రాణము. ఏదేని గ్రంథముయొక్క భాషాంతరీకరణము లేక అనువాదమనినంతనే అనేకులు మూతి విఱిచి పెడమొగము పెట్టుచుండుటకు అనువాదకులలో పెక్కు రీతత్త్వమును పాటింపకుండుటయే కారణమని చెప్పనగును. ఓపి నంతవఱకు ఇవ్విషయములను ఈ యనువాదమున గమనించి యున్నాను.

కన్నడభాషలో వై. సుబ్బారావు అనువారు వెలువరించిన స్వామి భక్తియోగానువాదము ఇందు నాకించుక తోడ్పడి యున్నది.

శ్రీ రామకృష్ణ మఠము,
మదరాసు,
8—11—1940.

ఇట్లు,
అనువాదకుడు.

# విషయసూచిక



# పరభక్తి





# భక్తియోగము



## మొదటి అధ్యాయము

## భక్తి నిర్వచనము

భగవానునిగూర్చి నిష్కామము, నిష్కళంకమునగు అన్వేషణమే భక్తియోగము. ఇయ్యది ప్రేమమున జనించి, ప్రేమలో వికాసమునొంది, ప్రేమమున లయించును. ఉత్కృష్టమగు నిట్టి భగవత్ప్రేమోన్మాదము క్షణము లభించెనేని అయ్యది మనకు శాశ్వతమోక్షము నొసగూర్చును. భక్తిసూత్రముల నుగ్గడించుచు నారదుడు, "భగవంతునియందలి పరమ ప్రేమయే భక్తి" ("సా త్వస్మిన్ పరమ ప్రేమరూపా") * యని నిర్వచించి యున్నాడు. అట్టి భక్తి లభించినమానవుడు సిద్ధుడు, మృత్యురహితుడు, తృప్తుడు నగును. † ఇకనతడు (ఇంచుకయు) దేనిని వాంఛింపడు; విచారమునకు అధీనుడుకాడు; ద్వేషింపడు; రమింపడు; (దేనియందును) అధికహర్షము నందడు. ‡ ఈ దివ్య ప్రేమకు ఏ యైహికలాభమును సరిరాదు. ¶ ఏలన లౌకికవిషయ

---

* నారద భక్తిసూత్రము, 2.

† యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధో భవత్యమృతో భవతి తృప్తో భవతి.— నారద భక్తిసూత్రము, 4.

‡ యత్ప్రాప్య న కించిద్వాంఛతి, న శోచతి, న ద్వేష్టి, న రమతే, నోత్సాహీ భవతి.— నారద. సూ. 5.

¶ "సా న కామయమానా నిరోధరూపత్వాత్" అను నారద భక్తిసూత్రము (6) నకు ఇయ్యది మూలతాత్పర్యము. 'నిరోధరూపత్వాత్' అనునది భక్తికి విశేషముగా దీసికొనినయెడల 'భక్తి కామములను నిరోధించును'

వాంఛ లున్నంతవఱకు భగవత్ప్రేమ మెన్నటికిని జనింపదు. కర్మముకంటెను, జ్ఞానముకంటెను, యోగముకంటెను భక్తి యధికతరము. కారణమేమన, నివి యన్నియు నేదియోయొక ప్రయోజనము నుద్దేశించునట్టివి; భక్తియన్ననో, దాని కదియే ప్రతిఫలము, సాధన, మఱియు సాధ్యము. *

భక్తి ప్రాముఖ్యమునుగూర్చియే మన మహర్షులు నిరంతరము నొక్కి వక్కాణించియున్నారు. † ముఖ్యముగా భక్తిని గూర్చి వ్రాసిన నారద శాండిల్య ఋషులమాట యటుండ, విశేషము జ్ఞానప్రబోధకులై వ్యాససూత్రములకు వ్యాఖ్యానము రచించిన శంకరాదులును భక్తినిగూర్చి యెంతయు పర్యాలోచింపదగిన భావములను వెల్లడించియున్నారు. వ్యాఖ్యానకర్త ప్రమాణవచనము లన్నిటికి గాకున్న అనేకమగు వానికి శుష్కజ్ఞానపరముగా అర్థము చెప్పివైచుట కెంత యాత్రపడినను ముఖ్యముగా ఉపాసనాప్రకరణమునందలి సూత్రములు ఆ విధమగు వ్యాఖ్యానమునకు వశమగుట దుస్తరము.

---

అని యర్థమగును. కామమునకు విశేషణముగా దీనికొనిన యెడల స్వామిభావమువచ్చును. ఈ యర్థమే భక్తిమార్గమునకు అనువర్తించును. "భుక్తిముక్తి స్పృహాయావత్ పిశాచీ హృదివర్తతే, తావద్భక్తి సుఖస్యాత్ర కథమభ్యుదయో భవేత్"—భోగమోక్షములను పిశాచము లెంతవఱకుండునో అంతవఱకు భక్తిసుఖము ఎట్లు లభించును? అను హరిభక్తి రసామృతసింధువందలి వాక్యములతో సరిపోల్పనగును.

* "సా తు కర్మజ్ఞానయోగేభ్యో ప్యధికతరా" (నారదభక్తిసూత్రము, 25); "ఫలరూపత్వాత్" (26); "స్వయం ఫలరూపతేతి బ్రహ్మకుమారః" (30)—భక్తియే సాధనము, సాధ్యము అని నారదుల మతము.

† 'శాండిల్యసూత్రములు,' 'నారదసూత్రములు' ఇవి రెండును భక్తికి ప్రమాణ గ్రంథములు.

జ్ఞానమునకును భక్తికిని నిజముగా జను లనుకొనునంత భేదము ఎన్నడును లేదు. పరిశీలించిన కొలదియు రెంటికిని గమ్యస్థాన మొక్కటియే యని మనకు వెల్లడి కాగలదు. రాజయోగ విషయముకూడ నిట్టిదే. అమాయకులగు సామాన్య జనుల కండ్లలో దుమ్ముగొట్టుటకుగాక మోక్షేచ్ఛతో నవలంబించినయెడల రాజయోగము ఆ పరమావధినే మనలను ప్రాపింపజేయును. కాని డాంబికయోగులు, కపటతంత్రవేత్తలు నగువారి చేజిక్కి మన దురదృష్టవశమున రాజయోగము తఱచు లోకవంచనకే వినియోగించుచున్నది.

భక్తిమార్గమునందలి గొప్పలాభము, ప్రయోజనమేమన అయ్యది పరమావధిని బొందుటకు అత్యంతము సహజము, సులభమునైన మార్గము: * ఇక నిందలి ప్రమాదమేమన, క్షుద్రమార్గములలో—ఉపాసనాకాండలో—తఱచుగా నిది ఘోరమగు పరమతద్వేషము, స్వమతదురభిమానముగా పరిణమించుచుండును. సనాతన ధర్మమునందుగాని, మహమ్మదీయ క్రైస్తవ మతములందుగాని స్వమతాభిమాన పిశాచగ్రస్తులు సర్వసాధారణముగా ఈ క్షుద్రదేవతోపాసక వర్గమునుండియే బయలుదేఱుచుందురు. ఎయ్యది లేనిచో నిక్కమగు ప్రేమలత వికాసము నొందదో అట్టి యిష్టనిష్ఠయే తఱచుగా ఇతరమత నిరసనమునకు గూడ కారణమగుచుండును. ప్రతిమతమునందును, ప్రతిదేశమునందును దుర్బలమనస్కులెల్లరును, ఆత్మవికాసరహితులెల్లరును తమ యాదర్శమునం దొకే విధముగా అభిమానము జూపుచుందురు—అది యేదన పరమతద్వేషము, పరమతాదర్శనిరసనము; తన యిష్టదేవతయందంత మక్కువగలభక్తుడే, స్వమతాదర్శ

* "అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ (నారద భక్తి సూ. 58).

మునందంత దిట్టయగు మానవుడే పరమతాదర్శము మాటగాని, పరమత విషయముగాని ప్రస్తావించినంతనే గగ్గోలుచేయు ద్వేషి యగుట కిదియే కారణము. తన యజమానిసొత్తు పరాధీనము గాకుండ రక్షించు కుక్కబుద్ధివంటిది కొంతవఱకు ఈ విధమైన స్వమతాభిమానము; విశేషమేమన, మానవుని తార్కిక బుద్ధి కంటెను కుక్కయొక్క సహజవిశ్వాసగుణమే మేలు; ఏలన, తన యజమాని యేవిధమగు దుస్తులను దాల్చి తన యెదుటికి వచ్చినను కుక్క వానిని శత్రువని భ్రమింపదు. మఱియొక విషయము—పరమతద్వేషికి విచక్షణశక్తి నశించును. వ్యక్తి గతాభిప్రాయములకే అతడు కేలుమోడ్చి వానిచే మోహితు డౌను: ఒకడేమైన జెప్పినచో అది న్యాయసమ్మతమా కాదా యను విషయమే వానికి అక్కఱలేదు; కాని యాతడు ఎల్లవేళల ముఖ్యముగా తెలిసికొన శ్రద్ధవహించున దొకటి కలదు—వానికి గావలసినది: అది యెవ్వరు చెప్పిరను విషయము. తన యభి ప్రాయముతో నేకీభవించువారియెడ దయాసౌజన్యములతో, ప్రేమానురాగములతో మెలగు మానవుడే మతాంతరులగు సోదరులపట్ల దారుణకృత్యములు చేయుటకు లేశమును సంకో చింపడు. *

సాధనదశలోనిదగు గౌణస్థితిలో నున్నప్పుడే భక్తిమార్గము నందు ఈ ప్రమాదము కలదు. భక్తి పరిపక్వమై పరాభక్తిగా పరిణమించినంతనే ఈ ఘోరమత ద్వేషాదులకు అవకాశముగాని వానివలని భయముగాని కలుగదు. ఉత్కృష్టమైన ఈ పరా

* క్రైస్తవులలో ప్రొటస్టెంట్ రోమన్ క్యాతలికుల యొక్కయు మహమ్మదీయులలో షియాసున్నీలయొక్కయు, హిందువులలో శైవ వైష్ణవ శాక్తేయులయొక్కయు పరస్పరనిందాదులను స్మరింపనగును.

భక్తి రసాస్వాదనమున తన్మయుడగు భక్తుడు ప్రేమమూర్తి యగు భగవానునకు అత్యంత సన్నిహితుడు; భక్తిరస పూరిత మగు నాతని హృదయమున ద్వేషమున కిక తావెక్కడిది?

సమరసమగు శీలనిర్మాణమునకు మనలో అందఱును పెట్టి పుట్టలేదు. ఐనను భక్తి జ్ఞాన యోగము లను నీ మూడును సంపూర్ణసమన్వయ మొందిన శీలమే మహత్తమ మైనదని మనకు తెలియును. పక్షి యెగురుటకు రెండు ఱెక్కలును చుక్కాని వంటిదగు తోకయును ఆవశ్యకములు గదా. ఇందొకటి జ్ఞానము, రెండవది భక్తి; యోగమే చుక్కానియగు తోక. ఒక్క పట్టున నీ మూటిని సమముగా ఉపాసింపజాలక భక్తిమార్గమును మాత్రమే అవలంబించువారు అవశ్యకము ఈ విషయమును గుర్తింపవలయును: క్రియాకలాపములును విధులును అభివృద్ధి జెందు సాధకునకు ఎంత యావశ్యకములయ్యును భగవానుని యందు మనకు గాఢానురక్తి కలుగజేయుటకంటె వానికి మఱి యొక ప్రయోజనము లేదు.

భక్తిప్రభావము నంగీకరించుటలో జ్ఞానాచార్యులును భక్త్యాచార్యులును ఏకీభవించుచున్నను వీరిలో ఇంచుక భేదాభిప్రాయము కలదు. జ్ఞానులు భక్తిని మోక్షసాధనముగా పరిగణింతురు; * భక్తులన్నో భక్తియే సాధనమనియు సాధ్యమనియు భావింతురు. † నా బుద్ధి కిదియంతగా భేదములేని తారతమ్యమని

---

* జ్ఞానవాదులు భజనమును ముక్తికి సాక్షాత్సాధనముగా నంగీకరింపరు.

† మానవుని పరమపురుషార్థము భుక్తిముక్తులు కావనియు భగవద్భక్తియే యనియు భక్తులు విశ్వసింతురు. ఇయ్యది చైతన్యపంథలో విశేషముగా గాన్పించును.

తోచుచున్నది. నిజమునకు సాధనముగా నుపయోగింపబడినపుడు భక్తికి సామాన్యోపాసన యని యర్థము; సాధకుడు పరిణతి నొందినవెనుక నాతని పూర్వానుభవము ఉత్తమమగు సర్వేశ్వరోపాసనతో అవినాభావసంబంధము నొందును. కోరకున్నను గాఢమగు భక్తి వెంబడిని నిక్కమగు జ్ఞానము కలిగితీరునన్న సంగతిని, పరిపూర్ణమగు జ్ఞానమునుండి యకలంకమగు భక్తి వేఱుపఱుపరానిదను సత్యమును * మఱచి యొక్కొక్కడును విచిత్రమగు తన యుపాసనా పద్ధతియే మోక్షద్వారమని చాటుచుండును.

మనము ఇవ్విషయమును మనసులో నిడుకొని మహాభాష్యకారులు † దీనినిగూర్చి యేమి తెల్పుదురో గ్రహింప యత్నింతము. "ఆవృత్తి రసకృదుపదేశాత్" అను సూత్రమును వివరించుచు శంకరభగవత్పాదులిట్లు నుడివియున్నారు:— "ఎట్లన జనులిట్లు పల్కుదురు,—'ఆతడు గురు నుపాసించుచున్నాడు,—ఆతడు రాజు నుపాసించుచున్నాడు. అట్లుపాసించుటయే తన పరమలక్ష్యముగా భావించి వారల ననువర్తించుచున్నాడు.' ఇట్లే వారిట్లు పలుకుదురు:—'ప్రియురాలగు భార్య తన ప్రాణేశ్వరునిగూర్చి ధ్యానించును'; ఇచటను ఉత్కంఠతో

---

* శ్లో. తేషా మేవాను కంపార్థ మహమజ్ఞానజం తమః,
నాశయా మ్యాత్మ భావస్థో జ్ఞానదీపేన భాస్వతా.
శ్లో. తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం తేన మా ముపయాన్తి తే.
—భగవద్గీత, 10—10, 11.

† శంకరరామానుజమధ్వాచార్యులు.

గూడిన నిరంతరస్మరణ యనియే తాత్పర్యము.''‡శంకరాచార్యు ననుసరించి యిదియే భక్తి. @

''ధ్యానంచ తైలధారావ దవిచ్ఛిన్నస్మృతిసంతానరూపమ్ —ధ్రువాస్మృతిః, స్మృతిలమ్భే సర్వగ్రన్థీనాం విప్రమోక్షః''— ఒక పాత్రనుండి మఱియొక పాత్రలోనికి ఎడతెగని ధారగా పోయబడిన చమురువలె (ధ్యేయమునుగూర్చి) చేయబడు నిరంతరమైన స్మరణమే ధ్యానము. (భగవంతునిగూర్చి) ఇట్టి నిరంతర స్మరణ లభించినంతనే భవబంధము లన్నియు పటాపంచలగును. *

‡ ఈ యనువాదము సంస్కృతమూలానుగుణముగా గ్రహింపబడినది. మూలవచనము లివి: ''(అపి చోపాసనమ్ నిదిధ్యాసనమ్ చేత్యంతర్ణీతా వృత్తిగుణైవ క్రియాభిధీయతే తథాహి) లోకే 'గురు ముపాస్తే రాజానముపాస్తే' ఇతి చయ స్తాత్పర్యేణగుర్వాదీ ననువర్తతే స ఏవముచ్యతే। తథా ధ్యాయతి ప్రోషితనాథా పతిమితి యా నిరంతర స్మరణా పతిం ప్రతిసోత్కంఠాసైవ మభిధీయతే॥ —బ్రహ్మసూత్ర శంకరభాష్యము. (4-1-1).

@ శంకరసిద్ధాంతము ననుసరించి ఇయ్యది ఉపాసనయొక్కయు గౌణ భక్తియొక్కయు లక్షణము; ఆత్మనిష్ఠయే నిజమైన భక్తి.

—గీతాభాష్యము (18-54).

* బ్రహ్మసూత్రరామానుజభాష్యము (1-1-1); మఱియు, ''ఇతి ధ్రువయాః స్మృతే రపవర్గోపాయత్వ శ్రవణాత్। సా చ స్మృతిర్దర్శన సమానాకారా—'భిద్యతే హృదయ గ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః। క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥' ఇత్యనేనైకార్థ్యాత్। ఏవంచ సతి 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః' ఇత్యనేన నిదిధ్యాసనస్య దర్శన సమానాకారతా విధీయతే। భవతి చ స్మృతేర్భావనా ప్రకర్షాద్దర్శన రూపతా......'ఉపాసి వంస్యాద్ధ్రువాను స్మృతిద్దర్శనాత్, నిర్వచనాచ్చ, ఇతి వేదన స్యోపాసన రూపస్య సకృదావృత్తస్యధ్రువాను స్మృతిత్వ ముపవర్ణితమ్॥ సేయం స్మృతి ర్దర్శనరూపా ప్రతిపాదితా। దర్శన రూపతాచ ప్రత్యక్షతాపత్తిః। ఏవం ప్రత్యక్షతాపన్నా మపవర్గసాధన భూతాం స్మృతిం విశినష్టి—'నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునాశ్రుతేన। యమే వైషవృణుతే తేన

ఇట్లు నిరంతరస్మరణమును గూర్చి స్మృతులచే నిది మోక్షోపాయమని చెప్పబడియున్నది. మఱియును ఈ స్మరణము తత్త్వదర్శనముతో సమ(రూప)మైనది. ఎట్లన, 'భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః। క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥' అనునట్లు 'దూరస్థమయ్యును సన్నిహితమగు పరతత్త్వమును దర్శించినంతనే అజ్ఞానపాశములు విచ్ఛిన్నములగును. సమస్తసంశయములును సమసిపోవును. అశేషకర్మక్షయమగును' అనునదియే ఇందలి తాత్పర్యము. సన్నిహితుడగు నాతని దర్శింపవచ్చును, కాని దూరస్థుడగు నాతని కేవలము స్మరింపనగును. * ఎట్లైనను, సన్నిహితు డగువానిని మాత్రమే కాక దూరస్థుడగు వానినిగూడ దర్శింపవలెను. ('ఆత్మావా అరే ద్రష్టవ్యః')అని శ్రుతి చెప్పునపుడు పైనిజెప్పినస్మరణము దర్శనముతో తుల్యమైనదని సూచితమగుచున్నది. ఈ స్మరణము అభివృద్ధి నొందినవుడు దర్శనముతో సమరూపము నొందును......నిరంతరస్మర

---

లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్॥ అనేన కేవల శ్రవణ మనన నిదిధ్యాసనా నాయమాత్మప్రాప్త్యనుపాయత్వముక్త్వా యమేవైష ఆత్మా వృణుతే తేనైవ లభ్య ఇత్యుక్తమ్। ప్రియతమ ఏవహి వరణీయో భవతి। యస్యాయం నిరతిశయ ప్రియస్స ఏవాస్య ప్రియతమో భవతి। యథాయం ప్రియతమ ఆత్మానంప్రాప్నోతి తథాస్వయమేవ భగవాన్ ప్రయతత ఇతి భగవతైవోక్తమ్—'తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్। దదామి బుద్ధియోగం తం యేనమాముపయాన్తి తే'॥ ఇతి—...అతః సాక్షాత్కార రూపాస్మృతిః స్మర్యమాణాత్యర్థప్రియత్వేన స్వయమత్యర్థ ప్రియా యస్య స ఏవ పరేణాత్మనా వరణీయో భవతీతి తేనైవ లభ్యతే పర ఆత్మేత్యుక్తం భవతి। ఏవం రూపాధ్రువానుస్మృతిరేవ భక్తిశబ్దేనాభిధీయతే॥"

—బ్రహ్మసూత్రరామానుజభాష్యము (1-1-1).

* దర్శనమునకును స్మరణమునకును భేదములేదు. రామానుజుల శ్రీభాష్యములో ఈ యభిప్రాయము కానవచ్చును.

ణమే ఉపాసనయని స్మృతిప్రామాణ్యము. మఱియు అనవరతోపాసనమే జ్ఞానము. ఈ జ్ఞానము నిరంతరస్మరణమని వర్ణింపబడినది......ఇట్లు సాక్షాత్కారతుల్యమగు నుత్తమస్మరణము శ్రుతిచే మోక్షోపాయమని చెప్పబడినది. 'నాయమాత్మా ప్రవచనేన లభ్యో నమేధయా నబహునాశ్రుతేన। యమైవైష వృణుతే తేనలభ్య స్తస్యైష ఆత్మా వివృణుతే తనూంస్వామ్॥'—ఈయాత్మను శాస్త్రప్రవచనములచే గాని, ధీశక్తిచేగాని, విశేషమగు వేదపఠనముచే గాని పొందజాలము. ఈ యాత్మ ఎవ్వని వరించునో వానికే లభించును; వానికే సాక్షాత్కరించును. ఇచట కేవల శ్రవణ మనన నిదిధ్యాసనములు ఆత్మప్రాప్త్యుపాయములు కావని చెప్పిన పిమ్మట, 'ఎవ్వని నీయాత్మ వరించునో వానికే ఈయాత్మ లభించును' అని చెప్పబడినది : ఎవ్వని కీయాత్మ ప్రియతమమో, వాడే ఆత్మకును ప్రియతము డగును. కావున నిట్టి ప్రియతమవస్తువును బొందుటకు స్వయముగా భగవానుడే (మనకు) తోడ్పడును.

శ్లో॥ 'తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్। దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే॥—సదానాయం దాసక్తులు, ప్రీతిపూర్వకముగా నన్ను భజించువారలు నగువారికి మత్ప్రాప్తి హేతువగు బుద్ధియోగము నొసగెదను' అని భగవానుడు వచించియున్నాడు. కావున స్మరణరూపక సాక్షాత్కారలక్ష్యమగు పరమాత్మకు ప్రియమగుటచే సాక్షాత్కారరూపమగు నీస్మరణ మెవ్వనికి ప్రియతమమో వానినే పరమాత్మ వరించును; వానికే పరమాత్మలాభము గలుగును. ఇట్టి నిరంతరస్మృతియే భక్తియనబడును.''

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను (వ్యాస) సూత్రమునకు వ్యాఖ్యానమున రామానుజభగవానుడు పైవిధమున చెప్పియున్నాడు.

"ఈశ్వర ప్రణిధానాద్వా" అనుపాతంజలయోగసూత్రమునకు వ్యాఖ్యానము చేయుచు, "ఈశ్వరో వక్ష్యమాణలక్షణః, తత్ర ప్రణిధానం భక్తి విశేషో విశిష్టముపాసనమ్, సర్వ క్రియాణాం తత్రార్పణం విషయ సుఖాదికం ఫలమనిచ్ఛన్ సర్వాః క్రియా స్తస్మిన్ పరమగురావర్పయతి తత్ప్రణిధానమ్"—విషయసుఖాదికఫలాపేక్షను విడిచి సమస్త కర్మములను పరమగురువగు నీశ్వరున కర్పించుటయే భక్తివిశేషమగు ప్రణిధానము" * అని భోజదేవుడు వచించియున్నాడు. అదియేసూత్రమునకు వ్యాఖ్యానమొనర్చుచు వ్యాసభగవానుడును † ప్రణిధానము నిట్లు నిర్వచించియున్నాడు: "ప్రణిధానాద్భక్తి విశేషాదావర్జిత, ఈశ్వర స్తమనుగృహ్ణాత్యభిధాన ధ్యానమాత్రేణ"—దేనిచే యోగికి కర మేశ్వరానుగ్రహము లభ్యమై యాతని కోరిక లీడేరునో అట్టి భక్తివిశేషమే ప్రణిధానము. "సా పరానురక్తి రీశ్వరే" ఈశ్వరునియం దనురక్తియే భక్తియని శాండిల్యనిర్వచనము. ‡ కాని, భక్తాగ్రేసరుడగు ప్రహ్లాదుని వచనమే భక్తికి ఉత్తమనిర్వచనము అని చెప్పవగును. శ్లో॥ "యాప్రీతి రవివేకానాం విషయే ష్వనపాయినీ। త్వాం అనుస్మరత సామే హృదయాన్మాపసర్పతు॥"—"క్షణికములగు విషయసుఖములయందు అవివేకుల కెట్టి ప్రీతియుండునో

---

* యోగసూత్ర వృత్తి, భోజదేవకృతము (1-28).

† వేదాంతసూత్రకర్తయైన వ్యాసుడును మహాభారతకర్తయైన వ్యాసుడును నొక్కరేనా యను విషయమున అభిప్రాయభేదము కలదు.

‡ శాండిల్యభక్తిసూత్రము (1-1-2).

—నిన్ను ధ్యానించునపుడు—(నీయందు) అట్టి (గాఢమగు) ప్రీతి నా హృదయమునుండి తొలగిపోకుండునుగాక!" ప్రీతి! ఎవని యందు? పరమేశ్వరునందు. ఇతర విషయములం దెంతటి ప్రీతి యున్నను అది భక్తి యనిపించుకొనజాలదు; ఏలన, శ్లో॥ "ఆ బ్రహ్మ స్తంబపర్యన్తా జగదన్తర్వ్యవస్థితాః ప్రాణినః కర్మ జనిత సంసార వశవర్తినః॥ యత స్తతో న తే ధ్యానే ధ్యానినాముపకారకాః। అవిద్యాన్తర్గతాః సర్వే తే హి సంసార గోచరాః॥" ® ప్రపంచమున బ్రహ్మ మొదలు గడ్డిపోచవఱకును సమస్తప్రాణులును కర్మజనితసంసారబద్ధములు; అందుచే నవి ధ్యానమునకు లక్ష్యభూతములు కానేరవు. ధ్యానమునకు ఉపకరింపజాలవు." ఇట్లు రామానుజాచార్యుడు సుప్రసిద్ధుడగు నొకపూర్వాచార్యుని వాక్యముల నుదాహరించుచు జెప్పియున్నాడు. శాండిల్యుడు ఉపయోగించిన 'అనురక్తి' యను మాటకు వ్యాఖ్యాన మొనర్చుచు 'అను' అనగా అనంతరమనియు 'రక్తి' యనగా రాగమనియు, అనగా పరమేశ్వరస్వభావవైభవములను గ్రహించిన పిమ్మట జనించు రక్తి యని స్వప్నేశ్వరాచార్యుడు జెప్పెను. * లేనిచో

® భవిష్యత్పురాణము, విష్ణుధర్మము. (104—28, 24).

—శ్రీభాష్యమున జిజ్ఞాసాధికరణవివరణమున నిది కానవచ్చును.

* స్వప్నేశ్వరుని వచనముల కిది యథార్థము కాదు, తాత్పర్యము. మూలవచనము లివి : "అనన్తు లక్షణాంతర్గతః। కింతు భగవత్ మహిమాది జ్ఞానా దను పశ్చాజ్జాయమానత్వా దనురక్తిరిత్యుక్తమ్। నను స్త్రీతాదిగోచరాను రాగస్యాపి ప్రకృత భక్తిత్వం ప్రసజ్యేత। జగత ఏవ పరమేశ్వరాత్మత్వాత్। అథ వికారా విశిష్ట ఏవ తథాత్వం వాచ్యం, తథాపి గోపీ ప్రభృతీనాం ప్రాదుర్భావా వచ్ఛిన్నేశ్వర భక్తావ వ్యాపకమ్। ఉచ్యతే శీతోపాధ్యన వచ్ఛిన్న చేతన విషయిణీ అనురక్తి రేవ సేతి॥"

—స్వప్నేశ్వరభాష్యము, శాండిల్యసూత్రము (1-1-2).

నెవ్వరియందైనను, అనగా భార్యాపుత్త్రాదులయందు మనకు ఉండు రాగము సైతము భక్తి యనవలసి వచ్చును. కావున సామాన్యమైన ఆరాధనతో మొదలిడి భగవానునియందు గాఢానురక్తియై మించు దివ్యానుభూతిని బొందుటకై చేయు సాధనక్రమమే భక్తి యని మన కిపుడు స్పష్టమగుచున్నది.

---

## రెండవ అధ్యాయము

## ఈశ్వరతత్త్వము

ఈశ్వరుడనగా నెవరు ? "జన్మాద్యస్య యతః"—ఈజగంబునకు సృష్టిస్థితిలయము లెవ్వని మూలమున గలుగుచున్నవో—అతడే యీశ్వరుడు : "అతడు నిత్యుడు, శుద్ధుడు, ముక్తుడు, సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, దయామయుడు, గురోర్గురుడు";* విశేషము, "స ఈశ్వరః అనిర్వచనీయప్రేమస్వరూపః"—ఆ యీశ్వరుడు అనిర్వచనీయప్రేమ స్వరూపుడు.

ఇవి యన్నియు సగుణబ్రహ్మనిర్వచనములు. ఐనచో నిద్దఱు భగవంతులు కలరా ? "నేతి నేతి"—"ఇదికాదు, ఇది కాదు" అని వేదాంతి చెప్పు సచ్చిదానందమయ బ్రహ్మ మొకడును, భక్తుడు వచించు ననిర్వచనీయప్రేమస్వరూపుడగు భగవానుడు వేఱొకడునా ? కాదు; ప్రేమస్వరూపుడగు భగవానుడే

---

* "నిత్య శుద్ధ బుద్ధ స్వభావ సర్వజ్ఞ స్వరూప కారణ పరాణి".—బ్రహ్మసూత్ర శంకరభాష్యము (1-1-2).

"తత్ర నిరతిశయం సర్వజ్ఞబీజమ్", "పూర్వేషా మపిగురుః కాలే నానవచ్ఛేదాత్."

—పాతంజలయోగసూత్రములు (1-25, 26).

సచ్చిదానందమయుడగు బ్రహ్మము. సగుణ నిర్గుణ బ్రహ్మ మొక్కడే. భక్తు లుపాసించు సగుణుడు, సాకారుడునగు భగవానుడు బ్రహ్మముకంటె వేఱుకాదని సదా మనము గుర్తింపవలసి యున్నది. సమస్తము అద్వితీయమగు బ్రహ్మమే. ఐనను ఏకము, నిర్గుణము నగు బ్రహ్మము అత్యంత సూక్ష్మము, అతీంద్రియము, మనస్సునకు అవిషయము నగుటచే అట్టి బ్రహ్మమును ప్రేమించి యుపాసింపజాలము; కావున భక్తుడు భగవానుని సగుణావస్థను అనగా సాకారుడగు నీశ్వరుని గైకొని యుపాసించును. దృష్టాంతముతో జెప్పనెడ అనంతమగు వివిధవస్తువుల నిర్మాణమునకు కారణభూతమైన మృత్తికవంటిది బ్రహ్మము అని చెప్పనొప్పును. మృత్తికారూపమున అవియన్నియు ఒక్కటియేయయ్యును, ఆకృతి, లేక వ్యక్తీకరణము వానిని వేఱుపఱుచుచున్నది. వానిలో నొక్కొక్కటియు ఆకృతి నొందకమున్ను మంటిలో గర్భితముగా నున్నవి; మఱియు వస్తుతః అవన్నియు నొక్కటే; కాని యాకృతి నొందినవెనుక, అది నిలిచియున్నంతవఱకు అవి భిన్నములు; మట్టియెలుక యెన్నడును మట్టియేనుగు కాజాలదు. ఏలన, రూపొందుటకుముందు మృత్తికారూపమున నవన్నియు ఒక్కటేయయ్యును, వ్యక్తీకరణముచే భిన్నమగుచున్నవి. పారమార్థికసత్తాయొక్క మహోన్నత వ్యక్తీకరణమే ఈశ్వరుడు, లేక బ్రహ్మమునుగూర్చి మానవమానసమునకు గోచరించు మహోన్నతభావమే ఈశ్వరుడు అని చెప్పనొప్పును. సృష్టి యనాది, నిత్యము; ఈశ్వరుడును అట్టివాడే. *

* "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి", "అనాదిమత్ పరంబ్రహ్మ" —భగవద్గీత (13-20, 13).

"జగద్వ్యాపారవర్జమ్ ప్రకరణాద సన్నిహితత్వాచ్చ" * అను సూత్రమున వ్యాసుడు ముక్తునకు ఇంచుమించుగా అనంత శక్తియు అనంతజ్ఞానమును గలుగునని వచించి పిమ్మట సృజనాది శక్తిమాత్రము పరమేశ్వరునిదే యనియు నితరు లెవ్వరును దానిని బొందజాలరనియు ప్రవచించియున్నాడు. ఈశ్వరాధీనుడగు జీవునకు అనంతశక్తియు పరిపూర్ణ స్వాతంత్ర్యమును ఎట్లు ఎన్నటికిని అసాధ్యములో తెలుపుట మన ద్వైతవాఖ్యానకర్తలకు కడు సులభము. ద్వైతవాఖ్యాన కర్తయగు మధ్వాచార్యుడు 'టూకీగా తన మామూలు పద్ధతి' ననుసరించి వరాహపురాణము నుండి యొక శ్లోకము నుదాహరించి యీ ఘట్టమునకు తాత్పర్యము జెప్పివేయును. †

ఈ సూత్రమునకు వ్యాఖ్యానమొనర్చుచు రామానుజాచార్యుడిట్లు వచించుచున్నాడు : ‡—"అసాధారణమగు పరమేశ్వరుని జగత్సృజనాది శక్తియు సర్వేశ్వరత్వమును ముక్తుని

* బ్రహ్మసూత్రము (4-4-17).

† సర్వాన్ కామానాప్త్వామృతః సమభవత్ ఇత్యుచ్యతే। తత్ర సృష్ట్యాదిభ్యోఽన్యాన్ వ్యాపారా నాప్నోతి కుతః ? జీవ ప్రకరణత్వాత్, జీవానాం తాదృక్సామర్థ్య విదూరత్వాచ్చ। వారాహేచ—'ప్రాప్యాధికానంద సంప్రాప్తౌ సృష్ట్యాదివ్యాప్రతిష్వపి। ముక్తానాం నైవకామః స్యా దన్యాన్ కామాంస్తుభుఞ్జతే॥ 1 ॥ తద్యోగ్యతా నైవ తేషాం కదాచిత్క్వాపి విద్యతే। నచాయోగ్యం విముక్తోపి ప్రాప్తుయాన్నచ కామయేత్ ॥ 2 ॥ ఇతి."

—బ్రహ్మసూత్రమాధ్వభాష్యము (4-4-17).

‡ "కిం ముక్త స్యైశ్వర్యం జగత్సృష్ట్యాది పరమపురుషాసాధారణమ్ సర్వేశ్వరత్వమపి, ఉత తద్రహితం కేవల పరమపురుషానుభవ విషయ మితి సంశయః । కిం యుక్తమ్ ? జగదీశ్వరత్వ మపీతి। కుతః ? 'నిరంజనః పరమం సామ్యముపైతి.' (ముండక.) ఇతి పరమపురుషేణ పరమసామ్యాపత్తి శ్రుతేః। సత్యసంకల్పత్వశ్రుతేః। నహి పరమసామ్యత్వ సత్యసంకల్పత్వే సర్వేశ్వరా

మైశ్వర్యసంపదలో జేరునా, లేక పరమేశ్వర సాక్షాత్కార
మొక్కటియే వాని యైశ్వర్యమా? యను శంక కీ క్రిందివిషయ
ములు సమాధాన మొసగును: 'నిరంజనః పరమం సామ్యము
పైతి' అను శ్రుతివాక్యము ననుసరించి ముక్తునకు జగదీశ్వరత్వ
మబ్బుననుట యుక్తమే. అసాధారణమగు సర్వేశ్వరుని జగ
న్నియమన శక్తిని బొందకయే వానితో పరమ సామ్యాపత్తియు

---

సాధారణ జగన్నియమనేన వినోపపద్యేతే। అతః సత్యసంకల్పత్వ పరమ
సామ్యాపత్తయే సమస్తజగన్నియమనరూపమపి ముక్తస్యైశ్వర్యమితి। ఏవం
ప్రాప్తే ప్రచక్ష్మహే—జగద్వ్యాపారవర్జమితి। జగద్వ్యాపారః—నిఖిలచేత
నాచేతనస్వరూపస్థితి ప్రవృత్తిభేదనియమనమ్। తద్వర్జమ్—నిరస్త నిఖిలతిరో
ధానస్య నిర్వ్యాజ బ్రహ్మానుభవరూపం ముక్తస్యైశ్వర్యం। కుతః? ప్రకర
ణాత్। నిఖిల జగన్నియమనం హి పరం బ్రహ్మ ప్రకృత్యామ్నాయతే—
'యతో వా ఇమాని భూతాని జాయన్తేయేన జాతాని జీవన్తి। యత్ప్రయం
త్యభి సంవిశన్తి। తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మ' ఇతి॥ యద్యేతన్నిఖిలజగన్నియ
మనమ్ ముక్తానామపి సాధారణం స్యాత్, తతశ్చేదం జగదీశ్వరత్వరూపం
బ్రహ్మలక్షణం నసంగచ్ఛతే। అసాధారణస్యహి లక్షణత్వం। తథా—'సదేవ
సోమ్యేద మగ్ర ఆసీదేక మేవాద్వితీయం తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి
తత్తేజోఽసృజత' (ఛాందోగ్య.), 'బ్రహ్మ వా ఇదమేక మేవాగ్ర ఆసీత్ తదేకం
సన్నవ్యభవత్, తచ్ఛ్రేయో రూపమత్య సృజత క్షత్రమ్। యాన్యేతాని దేవ
క్షత్రాణి ఇన్ద్రోవరుణః సోమోరుద్రః పర్జన్యోయమో మృత్యు రీశాన ఇతి'
(బృహదారణ్యక.), 'ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్, నాన్యత్కించన
మిషత్। స ఈక్షత లోకాన్నుసృజా ఇతి। స ఇమాన్ లోకానసృజత'
(ఐతరేయ.), 'ఏకోహవై నారాయణ ఆసీ న్న బ్రహ్మా నేశానో నసూర్యః।
స ఏకాకీ నరమత। తస్యధ్యానావస్తస్యైకా కన్యా దశేన్ద్రియాణి' (మహో.)
—ఇత్యాదిషు 'యః పృథివ్యాం తిష్ఠన్' 'పృథివ్యాఅన్తరః ఇత్యారభ్య
య ఆత్మని తిష్ఠన్' (బృ.), ఇత్యాదిషు చ నిఖిలజగన్నియమనం పరమపురుషం
ప్రకృత్యైవశ్రూయతే। అసన్నిహితత్వాచ్చ। నచైతేషు నిఖిలజగన్నియమన
ప్రసఙ్గేషు ముక్తస్య సన్నిధానమస్తి యేన జగద్వ్యాపారస్తస్యాపిస్యాత్॥''

—బ్రహ్మసూత్రరామానుజభాష్యము (4-4-17.)

సత్యసంకల్పత్వమును సిద్ధింపజాలవు. కావున వీనిని బొందుటకై ముక్తుడు జగన్నియమన శక్తినొందునని మనము ఒప్పుకొనవలయును. ఇందులకు మా సమాధానమిది: జగన్నియమనశక్తి దక్క మిగిలినవన్నియు ముక్తునకు లభించును. జగన్నియమన మన, సమస్తచేతనాచేతనములయొక్కయు స్వరూపస్థితి ప్రవృత్తి భేదములను నియమించుట. పరమేశ్వరుని యథార్థస్వభావమును గ్రహించు ముక్తులు నిర్వ్యాజమగు బ్రహ్మాత్మానుభవము నొందుదురేకాని జగన్నియమనశక్తి నొందజాలరు. ఇవ్విషయమున 'యతోవా ఇమాని భూతాని జాయన్తే। యేన జాతాని జీవన్తి। యత్ప్రయం త్యభిసంవిశన్తి। తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మ—ఎవ్వని యందుండి ఈ భూతములన్నియు బుట్టుచున్నవో, ఎవ్వనిచే సృష్టి జాతమంతయు జీవించుచున్నదో లయానంతరము మఱల నెవ్వనిలో ప్రవేశించుచున్నదో—దానినిగూర్చి జిజ్ఞాసచేయుము, అదియే బ్రహ్మము'—అని శ్రుతిచెప్పుచున్నది. జగన్నియమన లక్షణము ముక్తులకుగూడ సామాన్యమైనచో జగదీశ్వరత్వమును బ్రహ్మలక్షణముగా జెప్పు నీ శ్రుతివాక్యము అసంగత మనవలసి వచ్చును. అసాధారణగుణములే (వస్తు) లక్షణమును నిర్దేశించు నట్టివి; అందుచే, 'సదేవసోమ్యేదమగ్ర ఆసీ దేక మేవాద్వితీయం తదైక్షత బహుస్యాం ప్రజాయే యేతి తత్తేజోఽసృజత'—'వత్సా! ఏకము, అద్వితీయము నగు వస్తువొక్కటియే ఆదియందుండెను. అయ్యది అనేకమును సృజించెద ననుకొనెను. అప్పుడది తేజమును సృజించెను'.—'బ్రహ్మవా ఇదమేక మేవాగ్ర ఆసీత్ తదేకం సన్నవ్యభవత్, తచ్ఛ్రేయో రూపమత్య సృజత క్షత్రం। యాన్యేతాని దేవక్షత్రాణి ఇన్ద్రోవరుణః సోమోరుద్రః పర్జన్యోయమో మృత్యురీశాన ఇతి—(నిజముగా) బ్రహ్మమొక్క

టియే ఆదియందుండెను. అది యనేకమయ్యెను. అయ్యది పావనమగు క్షత్రరూపమును సృజించెను. వరుణుడు, సోముడు, రుద్రుడు, పర్జన్యుడు, యముడు, మృత్యువు, ఈశానుడు—ఈ దేవతలందఱు క్షత్రులే.'—'ఆత్మావా ఇదమేక ఏవాగ్రఆసీత్, నాన్యత్కించన మిషత్। స ఈక్షత లోకాన్ను సృజాఇతి। స ఇమాన్ లోకానసృజత'—'ఆత్మ యొక్కటియే ఆదియందుండెను; మఱియేదియు (స్పందింప) లేదు; ఆతడు లోకమును సృజించెను, అటువెనుక నాతడు లోకమును సృజించెను.—'ఏకో హవై నారాయణ ఆసీన్న బ్రహ్మానేశానో నసూర్యః। స ఏకాకీ నరమేత। తస్యధ్యానావ స్థస్యైకా కన్యాదశేన్ద్రియాణి.'—'నారాయణు డొక్కడే యుండెను; బ్రహ్మగాని ఈశానుడుగాని సూర్యుడుగాని లేడు. ఏకాకియగు నాతడు రమింపకుండెను. ఆతడు తన ధ్యానానంతరము ఒక్కకూతును దశేంద్రియములను బడసెను'.—మఱియు 'యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరః ఇత్యారభ్య 'య ఆత్మనితిష్ఠన్'—పృథివియందు సంస్థితుడయ్యు నెవడు పృథివికంటె భిన్నుడో, ఆత్మయందు సంస్థితుడయ్యు'—మొదలగు వాక్యములచే పరమ పురుషుడు జగన్నియమనకర్త యని శ్రుతులు వక్కాణించుచున్నవి.........దీనిచే జగన్నియమనము ముక్తునకు లక్షణముగా జెప్పనొప్పుచో ఈవర్ణన లన్నిటిలో ముక్తుని విషయమై అట్టి ప్రసక్తియేదియు కానరాదు." తరువాతి సూత్రము*నకు వ్యాఖ్యానమొనర్చుచు రామానుజు డిట్లు వచించుచున్నాడు. †"ఇందులకు వ్యతిరిక్తముగా వేదములలో ప్రమాణవచనము

* "ప్రత్యక్షోప దేశాదితిచే న్నాధికారిక మండల స్థోక్తేః."

† "స స్వరాడ్భవతి। తస్య సర్వేషు లోకేషు కామచారోభవతి (ఛాం

లుండుటచే నిది కాదనినయెడల ఈ వచనములు అస్వతంత్ర దేవతా లోకములలో ముక్తులకు గలుగు నైశ్వర్యమును దెలుపును." మన సంశయనివృత్తి కిదియు నొక సులభోపాయమే. రామానుజసిద్ధాంతము సాముదాయకముగా ఏకత్వము నంగీకరించుచున్నది. ఐనను అట్టి సాముదాయకస్థితియందు అంతర్గతమైన నిత్యభేదములు కలవని యాతని సిద్ధాంతము. ప్రాయికముగా నిదియు ద్వైతసిద్ధాంతమే యగుటచే జీవేశ్వరులమధ్య గల భేదమును స్పష్టముగా నిరూపించుట రామానుజులకు సులభసాధ్యమైనది.

ఇక నిర్విషయమైన అద్వైతసిద్ధాంతమహాప్రవక్త యేమి చెప్పునో గ్రహింప యత్నింతము. ద్వైతమతస్థుని ఆశయములన్నిటిని అద్వైతమతము లెస్సగా సమర్థించుటయేగాక మానవ దివ్యత్వముయొక్క పరమావధి కనుగుణముగా స్వకీయ సిద్ధాంతమును ప్రతిపాదించుచున్నది. ముక్తినొందిన వెనుక గూడ తమ ప్రత్యేకమానసమును తమ వ్యక్తిత్వమును నిలిపియుంచుకొన నాశించువారు తమ యాశయముల నీడేర్చుకొనుటకును సగుణబ్రహ్మప్రసాదమును బడయుటకును అద్వైతమతమున నెంతేని యవకాశముగలదు. వీరినిగూర్చియే భాగవతపురాణమునం దిట్లు చెప్పబడినది : "ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే। కుర్వంత్యహైతుకీమ్ భక్తిమిత్థం

---

భోగ్య.) 'ఇమాన్ లోకాన్ కామాన్నీ కామరూప్యనుసంచరన్'—ఇతి ప్రత్యక్షేణ శ్రుతౌ ముక్తస్య జగద్వ్యాపార ఉపదిష్యతే అతో న జగద్వ్యాపార వర్జమితి చేత్ తన్న, ఆధికారిక మండలస్థోక్తేః॥"

—బ్రహ్మసూత్రరామానుజభాష్యము (4-4-18)

భూతగుణో హరిః॥—*ఆత్మారాములును, భవబంధవిముక్తులును, నిరపేక్షులును నగు మునులు అవ్యాజముగా హరిభజనము చేయు చుందురు; హరి యట్టి యనంతకల్యాణగుణాన్వితుడు". ఈ కల్ప మున ప్రకృతిలో లయమొంది, పరిపూర్ణత నొందినవెనుక తరు వాతి కల్పమున లోకపాలకులై వెలువడుదురని సాంఖ్యులచే జెప్పబడువారును వీరే. కాని వీరిలో నెవ్వరు నీశ్వరునితో సములుకారు. ఎచట సృష్ట్యాదికములులేవో, ఎచట జ్ఞాతృ జ్ఞానజ్ఞేయములు లేవో, ఎచట నీవు, నేను, వాడు, అది అను భేదములు లేవో, ఎచట కర్తృత్వ భోక్తృత్వాదికములు కాన రావో, అచట ఎవ్వడు ఎవ్వనిని గాంచును ? * అట్టివారు సర్వా తీతులై అవాఙ్మానసగోచరమగు తావునకు † శ్రుతులు, "అథాత ఆదేశోనేతి నేతి"—"ఇదికాదు, ఇదికాదు" ‡ అని (దేనిని గూర్చి) వక్కాణించునో ఆ తావునకు ఏగెదరు; కాని యీ మహోన్నతస్థితిని బొందజాలనివారలకు, లేక పొందనివారలకు

* భాగవతము (1-7-10). ఇందుల క్రిందిది పోతన కవీంద్రుని యాంధ్రీకరణము : క. "ధీరులు, నిరపేక్షులు నా, త్మారాములునైన మునులు హరిభజనము ని। ష్కారణము చేయుచుందురు, నారాయణుఁ డట్టివాఁడ నవ్యచరిత్రా॥"

—ఆంధ్రభాగవతము (1-138).

* "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్" (బృహదారణ్యక. 4-5-15). ఇదియే వాక్యము దానిలో 2-4-14 నందును గలదు. కాని యందు, "యత్రవా అస్య సర్వ మాత్మైవాభూత్తత్కేన కం జిఘ్రేత్తత్కేన కంపశ్యేత్"—ఇట్లున్నది.

† "యతో వాచో నివర్తన్తే అప్రాప్యమనసా సహ." (తైత్తిరీయ.) ఇదియే వాక్యము 2-4-1 అందును గలదు; కాని యది మనోమయాత్మవిష యము.

‡ బృహదారణ్యక. (2-3-6); "సఏష నేతి నేత్యాత్మా" (4-6-15).

ఏకము, అవ్యాకృతమునగు బ్రహ్మముయొక్క సాక్షాత్కారము జీవజగదీశుల రూపమున త్రిగుణాత్మకమై గోచరించుట విధాయకము. ఇక్కారణమున ప్రహ్లాదుడు తన్నుదా మఱచినతఱి జగముగాని జగత్కర్తగాని యాతనికి గానరాలేదు; సమస్తము నామరూప భేదరహితమగు నొకే యనంతవస్తువుగా గోచరించెను. కాని యాతనికి తాను ప్రహ్లాదుడనను స్ఫురణ గలినంతనే ఎదుట జగత్తును, జగముతో అనంతకల్యాణగుణాకరుడగు *

---

* "ఏవం సఞ్చిన్తయన్ విష్ణు మభేదే నాత్మనోద్విజ।
తన్మయత్వ మవాపాగ్ర్యం మేనే చాత్మాన మచ్యుతమ్॥ 1

విసస్మార తథాత్మానం నాన్యత్కించి దజానత।
అహమేవా వ్యయోనంతః పరమాత్మేతి చిన్తయన్॥ 2

తస్య తద్భావనా యోగాత్ క్షీణపాపస్య వై క్రమాత్।
శుద్ధేన్తఃకరణే విష్ణు స్తస్థౌ జ్ఞాన మయోఽచ్యుతః॥ 3

యోగప్రభావా త్ప్రహ్లాదే జాతే విష్ణుమయేఽసురే।
ఝుటిత్యురగ బంధైస్తై ర్మైత్రేయ త్రుటితం క్షణాత్॥ 4

భ్రాన్తగ్రాహగణః సోర్మిర్యయౌ క్షోభం మహార్ణవః।
చచాలచ మహీ సర్వా సశైలవనకాననా॥ 5

సచతం శైల సఙ్ఘాతం దైత్య ర్న్యస్తమథోపరి।
ప్రక్షిప్య సలిలాత్తస్మాన్నిష్క్రామ మహామతిః॥ 6

దృష్ట్వాసచ జగద్భూయో గగనా ద్యుపలక్షణమ్।
ప్రహ్లాదోఽస్మీతి సస్మార పునరాత్మానమాత్మనా॥ 7

తుష్టావచ పునర్ధీమా ననాదిం పురుషోత్తమమ్।
ఏకాగ్రమతి రవ్యగ్రో యతవాక్కాయమానసః॥ 8

ప్రహ్లాద ఉవాచ:

ఓంనమః పరమార్థాయ స్థూలసూక్ష్మ క్షరాక్షర।
వ్యక్తాఽవ్యక్త కలాతీత సకలేశ నిరఞ్జనా॥ 9

జగదీశుడును సాక్షాత్కరించెను. ధన్యాత్మలగు గోపికల విషయముకూడ నిట్టిదే. తమ వ్యక్తిత్వమును ప్రత్యేకత్వమును మఱచియున్నంతవఱకు వారందఱును కృష్ణులే; * మఱి తాము

---

గుణాఞ్జన గుణాధార నిర్గుణాత్మన్ పరస్థిత।
మూర్తామూర్త మహామూర్తే సూక్ష్మమూర్తే స్ఫుటాస్ఫుట॥" 10

—విష్ణుపురాణము (1-20-10).

ఈ భాగమున "సమస్తకల్యాణగుణాకర" యను విశేషణము లేకున్నను ఐదవ యధ్యాయమున ఆఱవశ్లోకములో ఆయభిప్రాయ మిట్లున్నది: "సమస్తకల్యాణగుణాకరోఽసౌ స్వశక్తిలేశా వృతభూతసర్గః। ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః సంసాధితాశేష జగద్ధితోఽసౌ॥"

*సీ. "పూతనరైరొక్క పొలఁతి చరింపంగ, శౌరినైయొక కాంతచన్నుఁగుడుచు
బాలుఁడైయొక భామ పాలకు నేడ్చుచో, బండి నేననుచేమఁ బాఱఁదన్ను
సుడిగాలి నని యొక్క సుందరి గొనిపోవ, హరినని వర్తించునబ్జముఖియు
బకుఁడ నేనని యొక్క పడఁతి సంరంభింపఁ, బద్మాక్షుఁడను కొమ్మ పరిభవించు

తే. వెలమి రామకృష్ణు లింతు లిద్దఱు గాఁగ, గోపవత్సగణము గొందఱగుదు
రసురవైరి ననుచు నబలయొక్కతె చీరఁ, బసుల మనెడి సతులఁ భరతముఖ్య.

ఆ. లోకమెల్ల గుక్షిలోపలనున్నది, మాధవుండ నేను మాతవీవు
చూడుమనుచు నొక్క సుందరి యొకతెకు, ముఖము దెఱచి చూపు ముఖ్యచరిత.

క. వెన్నలు దొంగిలి తినిరొండి, వెన్నుఁడనని యొకతె నుడువ వేఱొక్కతె చే
సన్నల యశోద నంచును, గ్రన్నన కుసుమములదండఁ గట్టు నిలేశా.

క. కాళియఫణి యిది వీరలు, కాళియఫణిసతులు త్రొక్కఁగడిగిరి నే గో
పాలకుమారుఁడ ననుచును, లీలాగతి నాడు నొక్క లేమ నరేంద్రా.

క. తరుణులు గోపకు లందఱు, హరిహాయుఁడిదె వానగురిసె హరినేనని భా
సురచేలాంచల మొక్కతె, గిరి యెత్తిద ననుచు నెత్తుఁ గెంగేల నృపా.

క. మీరలు గోపకులే నను, రాఁగని దావాగ్ని వచ్చె నటు సూడకుఁడీ
వారించెదనని యొక్కతె, సేరి బయల్ కబళనంబు సేయు నరేంద్రా."

—ఆంధ్రభాగవతము, దశమస్కంధము, పూర్వభాగము (1019-1024).

గోపికలమనియు కృష్ణుడు ఒక్కడే ఆరాధ్యుడనియు * భావింప మొదలిడినంతనే, "తాసామావిరభూ చ్ఛౌరిః స్మయమాన ముఖాంబుజః। పీతాంబరధరః స్రగ్వీ సాక్షాన్మన్మథ మన్మథః॥ † —స్మయమానముఖాంబుజుడు, పీతాంబరధారియు, వనమాలియు, సాక్షాన్మన్మథమన్మథుడునై కృష్ణుడు వారలకు సాక్షాత్కరించెను.

ఇక శంకరాచార్యుని వ్యాఖ్యానమునకు (*) మఱలుదము: "మనోయుక్తులై యెవ్వరు సగుణబ్రహ్మోపాసన మొనరించి,

* ఉ. "నీవు యశోద బిడ్డఁడవె నీరజనేత్ర సమస్తజంతుచే
తో విదితాత్మ వీక్షకుఁడవు తొల్లి విరించి దలంచి లోక ర
క్షావిధ మాచరింపుమని సన్నుతి సేయఁగ సత్కులంబునన్
భూవలయంబుఁగావ నిటు పుట్టితిగాదె మనోహరాకృతిన్."

† మ. అని యిట్లంగన లంచితస్వరముతో నంకించుచుం బాడుచుం
దనురావేయని చీరి యేడువ జగత్త్రాణుండు త్రైలోక్యమో
హనుఁడై మన్మథమన్మథుండయి మనోజ్ఞాకారుఁడై హారియై
ఘనపీతాంబరధారియై పొడమెఁ దత్కాంతాసమీపంబునన్."

—ఆంధ్రభాగవతము, దశమస్కంధము, పూర్వభాగము (1039, 1058).

(*) "యే సగుణబ్రహ్మోపాసనాత్ సహైవ మనసా ఈశ్వర సాయుజ్యం వ్రజన్తి, కిం తేషాం నిరవగ్రహ మైశ్వర్యం భవతి, ఆహోస్విత్సావగ్రహం—ఇతిసంశయః. కింతావత్ప్రాప్తమ్? నిరంకుశమేవైషా మైశ్వర్యం భవితు మర్హతి. 'ఆప్నోతి స్వారాజ్యం' (తైత్తిరీయ.), 'సర్వేఽస్మై దేవా బలి మావహన్తి' (తైత్తిరీయ.), 'తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి' (ఛాందోగ్య.)—ఇత్యాది శ్రుతిభ్య ఇతి. ఏవం ప్రాప్తే పఠతి జగద్వ్యాపార వర్జమితి. జగదుత్పత్త్యాది వ్యాపారం వర్జయిత్వా న్య దణి మా ద్యాత్మక మైశ్వర్యం ముక్తానాం భవితుమర్హతి. జగద్వ్యాపారస్తు నిత్యసిద్ధస్యైవేశ్వరస్య. కుతః? తస్యతత్ర ప్రకృతత్వాత్, అసన్నిహితత్వాచ్చేతరేషాం. పర ఏవ హి ఈశ్వరో జగద్వ్యాపారేఽధికృతః తమేవ ప్రకృత్యోత్పత్త్యాద్యుపదేశాత్. నిత్యశబ్దనిబన్ధన త్వాచ్చ. తదన్వేషణ విజిజ్ఞాసనపూర్వకమ్ త్వితరేషా మణిమాద్యైశ్వర్యం శ్రూయతే. తేనా సన్నిహితాస్తే జగ

యాశ్వర సాయుజ్యము నొందుదురో వారల యైశ్వర్యమునకు. వధి కలదా, లేదా యని శంకించిన మన కీ క్రింది విషయములు విల్లడియగును : 'ఆప్నోతి స్వారాజ్యం'—వారు స్వారాజ్యము నొందుదురు; 'సర్వేస్మై దేవా బలిమావహన్తి'—దేవతలందఱు వాతని బూజింతురు; 'తేషాం సర్వేషు లోకేషు కామాచారో భవతి'—సమస్తలోకములందును వారలకోరిక లీడేఱును: ఇట్టి శ్రుతివాక్యముల ననుసరించి వారల యైశ్వర్యము నిరవధికమని చెప్పవలసియుండును. ఇందులకు వ్యాసుడు, 'జగన్నియమనశక్తి వినా' యని సమాధానమొసగును. జగత్సృజనాదిశక్తులు దక్క మిగిలిన యణిమాది సిద్ధులన్నియు ముక్తులకు గలుగును. జగన్నియమనశక్తియోయనిన, అయ్యది నిత్యపరిపూర్ణుడగు నీశ్వరునిదే. ఏలన, సృజనాదిశక్తులనుగూర్చిన శ్రుతివాక్యము లాతనికే యనువర్తించును, మఱియును ఈ సందర్భమున గల శ్రుతులలో ముక్తుని ప్రసక్తియే లేదు. నిజమునకు పరమేశ్వరుడు ఒక్కడే జగన్నియామకుడు. సృష్ట్యాదివిషయకమగు శ్రుతులన్నియు వానినే దెలుపును. మఱియు (ఈశ్వరవిషయమై) 'నిత్యపరిపూర్ణ డ'ను విశేషణముగూడ ప్రయోగింపబడియున్నది. ఇందులకు తోడు అణిమాది సిద్ధులు ఈశ్వరాన్వేషణముతోడను, ఈశ్వరారాధనముతోడను గూడుకొని యున్నవని శ్రుతులు చెప్పుచున్నవి. కావున జగన్నియమనమున ముక్తులకు అధికారము

---

ద్వ్యాపారే. సమనస్కత్వా దేవ చైతేషామనైకమత్యే కస్యచిత్ స్థిత్యభిప్రాయః కస్యచిత్సంహారాభిప్రాయ ఇత్యేవం విరోధోఽపి కదాచిత్స్యాత్. అథకస్యచిత్సంకల్పమన్వన్యస్యసంకల్ప ఇత్యవిరోధః సమర్థ్యతే, తతః పరమేశ్వరాకూతత న్త్రత్వమేవేతరేషామితి వ్యవతిష్ఠతే."

—బ్రహ్మసూత్రశంకరభాష్యము (4-4-17).

లేదు. మఱియు వారు తమతమ మానసములతోఁగూడియుండు టచే వారివారి సంకల్పములు భేదింపవచ్చును; ఒకడు సృష్టింతమనుకొన్న వేఱొకడు సంహారమొనర్ప నిచ్ఛగింపవచ్చును. ఈ దోషమును పరిహరించుటకు అందఱి సంకల్పములను ఎవ్వనిదో యొకనిసంకల్పమునకు కట్టుపడియుండునట్లు చేయుటొక్కటే మార్గము. కావున ముక్తుల సంకల్పములు పరమేశ్వరసంకల్పముపై నాధారపడియుండుననుట సిద్ధాంతము.''

ఇక్కారణమున సగుణ బ్రహ్మభావముననే భక్తిని ప్రసరింపజేయనగును. 'క్లేశోఽధికతర స్తేషామవ్యక్తాసక్తచేతసామ్' * —నిర్గుణబ్రహ్మమునందు ఆసక్తమైన చిత్తముగలవారలమార్గము కష్టతరము. మనయొక్క స్వభావమునకు అనుగుణముగానుండెనేని భక్తివాహిని నిరాటంకముగా బ్రవహించును. బ్రహ్మమును గూర్చి భావించునపుడు మానవరూపముతో,మానవస్వభావముతో గూడినవాడని భావింతుము; వేఱువిధముగా భావింపజాలమనుట నిశ్చయము. కాని, మనము గ్రహించు నితరవిషయములన్నిటి పట్లనుమాత్రము ఈ సత్యము అనువర్తించుటలేదా ? ఇంతవఱకు లోకమెఱింగిన మహోన్నతమనశ్శాస్త్రజ్ఞుడగు కపిలభగవానుడు బాహ్యాభ్యంతరములలో మనము ఊహచేగాని ప్రత్యక్షదర్శనముచే గాని గ్రహించునట్టి సమస్తవస్తుజాతముయొక్క నిర్మాణమునను మానవునియొక్క యనువది ప్రధానతత్త్వమని యనేకశతాబ్దములకు ముందే నిరూపించి యున్నాడు. శరీరము మొదలుకొని యీశ్వరునిపర్యంతము మనకు గోచరించు ప్రతివస్తువును మనయొక్కయు, ఎఱుకతోఁగూడిన యితరమగు నేదియోయొక తత్త్వమునై యున్నదని గ్రహింపనగును. ఆయితరమేదియైననగు

* భగవద్గీత (12-5).

గాక; అనివార్యమగు నీ మిశ్రమమే సామాన్యముగా మనము సత్యమని భావించునట్టిది. నిజముగా నెన్నటికైనను మానవ మానస మెఱుంగదగిన సత్యమంతయు నింతియే. మానవాకృతితో, మానవస్వభావముతో గూడినవాడని భావింపబడుటచే ఈశ్వరుడు మిథ్యయనిచెప్పుట ప్రలాపము. ఇయ్యది విజ్ఞానవాద బాహ్యసత్తావాదములను * గూర్చి పాశ్చాత్యుల వాగ్వాదముల వలె నున్నది. వీనినిగూర్చి యేమికోలాహలము! ఏమిగందరగోళము! దీనికంతటికి మూలము సత్తాయను మాటనుగూర్చి కేవలవాక్చమత్కారము! సత్తాయను మాటచే తెలియునట్టి అభిప్రాయము నంతను ఈశ్వరుడను భావము వెల్లడించును. మఱియు లోకమున మఱియేయితరవస్తువైనను ఎంతసత్యమో ఈశ్వరుడును అంతసత్యము. † పర్యవసానమున ఇవుడు సూచితమగు దానికంటె విశేషార్థమును దేనిని సత్తాయనుశబ్దము తెలుపదు. ఈశ్వరునిగూర్చి మన తత్త్వశాస్త్రాభిప్రాయమిది.

---

## మూడవ అధ్యాయము

## బ్రహ్మానుభవమే భక్తియోగాశయము

భక్తునకు ఈ (శుష్క) విధులన్నియు కేవలము దృఢబుద్ధి కలుగుటకుమాత్రమే ఆవశ్యకములు; అంతకంటె వానివలన ఆతనికి మఱియొక ప్రయోజనములేదు. ఏలన అజ్ఞానావృతమై

---

* Idealism = విజ్ఞానవాదము. Realism = బాహ్యసత్తావాదము. మానసవిజ్ఞానమునకు బాహ్యముగా ఏ వస్తువును లేదనునది విజ్ఞానవాదము.

† చైతన్యమునకును వస్తువునకును సంబంధముకలదు: ఇది సత్యత్వలక్షణము.

చిత్తభ్రమణహేతువగు హేతువాదమునుండి సంతరింపజేయు, శీఘ్రముగా సాక్షాత్కారసాధమునకు గొనిపోవసమర్థమైన దివ్య మార్గమును అతడు అవలంబించుచున్నాడు. భగవదనుగ్రహము వలన శీఘ్రముగా నాతడు డాంబికము, నిస్సారమునగు హేతు వాదము నతిక్రమించి, అజ్ఞానమను చీకటిలో దడవులాడు కేవలధీ శక్తినిదాటి, సాక్షాత్కారతేజోనిలయమగు మహోన్నతస్థితిని బొందును. ఇక నాతడు ఎంతమాత్రము హేతువాదమునకు దిగడు, హేతువాదమును విశ్వసింపడు, స్వయముగా తత్త్వమును దర్శించును. ఇక నాతడు ఎంతమాత్రము తర్కింపడు. కాని స్వయముగా సత్యమును గ్రహించును. మఱియును ఈ బ్రహ్మ దర్శనము—బ్రహ్మానుభవము—బ్రహ్మానందమునకు మించిన దేమున్నది? ఏల? సాయుజ్యముక్తికంటెను భక్తియే అధికతరమని వక్కాణించు భక్తులు లేకపోలేదు. మఱియునిది మహోత్తమ ప్రయోజనముకాదా? ఏది శరీరసౌఖ్యమునకు అనుకూలించునో అదియే ఉపయోగకరము, ప్రయోజనకరమని నమ్మువారు, విశేషము, అందు అధికసంఖ్యాకులు లోకములోనున్నారు. పారమార్థికచింత, భగవంతుడు, నిత్యత్వము అనువానిలో నేదియు వారికి లేశమును ప్రయోజనకారి కాదు; ఏలన నివివారికి ధనము నీయవు, శరీరసౌఖ్యము నీయవు. ఇంద్రియములను తృప్తిపఱచి భోగవాంఛల ననునయింపనివన్నియు అట్టివారికి నిరుపయోగములు. ఏమైనను, ప్రయోజనకరమనునది ప్రతివ్యక్తి ననుసరించియు ప్రత్యేకమగు కొన్నివాంఛలతో నిబద్ధమైయున్నది. తినుట, త్రాగుట, సంతానము గనుట, తుదకు మరణించుట—వీనికంటె నెన్నడు ఉన్నతిజెందనివారికి, అందుచే, విషయోపభోగములందే లాభము గాన్పించుచుండును. మఱివారు అంతకంటె ఉన్నత

విషయముల ఆవశ్యకతను లేశమైనను గుర్తించుటకు—గుర్తింప నేర్చికొనుటకు—జన్మజన్మాంతరముల నెత్తుచు వేచియుండ వల యును. కాని, శాశ్వతాత్మాభిరుచు లెవ్వరికి క్షణికప్రాపంచిక విషయవాంఛలకంటె ఉత్తమప్రయోజనకరములో, ఇంద్రియ భోగము లెవ్వరికి అనాలోచితమగు బాల్యక్రీడలో, వారికి భగ వంతుడును భగవద్భక్తియు మానవజీవితమందలి మహోత్త మము, అద్వితీయమునగు ప్రయోజనముగా గాన్పించును. లౌకిక వాంఛలలో మునిగితేలు నీలోకమున, భగవదనుగ్రహముచే గొందఱైన నట్టివారు ఇంకను సజీవులైయున్నారు.

ఇవఱకే చెప్పియున్నరీతిని సాధనదశయందలిదగు గౌణ భక్తి, సిద్ధావస్థయందలి పరభక్తియునని భక్తియోగము రెండువిధములుగా విభజింపబడియున్నది. అభివృద్ధి నొందగల్గు టకు సాధనదశలో మనకు అనేక ప్రత్యేకసాహాయ్యములు ఎట్లు అత్యంతము ఆవశ్యకములో ముందు మనకు విశదముకాగలదు; మఱియు పౌరాణికములు, సాంకేతికములునగు భాగములు సర్వ మతములందును సహజమైన వికాసమునొంది, ఆత్మాభివృద్ధి నొందుటకు సాధకునకు ప్రారంభమున సహాయభూతములై ఆతని జీవిత లతను పెనవైచికొనియుండును. ఏ మతసంప్రదాయము లలో విపులమగు పురాణములును కర్మకలాపములును చక్కని వికాసము నొందియున్నవో ఆ మత సంప్రదాయములందే పార మార్థికమహిమాన్వితులు—ఆధ్యాత్మిక సింహములు—వెలువడు చుండుట గమనింపదగిన విషయము. రమణీయార్థ ప్రతిపాదక ములగు గాథలనన్నిటిని, రసోచితమై మహోన్నతమై మించు ఘట్టములన్నిటిని, ఆత్మమార్గమున ఊగులాడు బాలమానసము నకు గట్టిప్రాపు లభింపజేయు పట్టులనన్నిటిని నిర్మూలింపయత్నించు

శుష్కమార్గాభినివేశనిలయమగు మతవిధానములు—ఆధ్యాత్మిక సౌధమునందలి మూలస్తంభమును పెకలింపయత్నించు మత విధానములు—ఉజ్జీవనకరమగు ఘట్టములనన్నిటిని తత్త్వమును గూర్చి తమకుగల అజ్ఞానముచే, మూఢవిశ్వాసములచే, ఉన్మూలింప యత్నించు మతవిధానములు—మానవ హృదయమున వికాసమునొందు జ్ఞానలతకు దోహదమొసగునట్టి కర్మకలాపము లను ధ్వస్తమొనర్పయత్నించు మతవిధానములు—తుదకు తమకు మిగులనదంతయు సారహీనమగు వట్టిశబ్దజాలమని, నిస్సారమగు వట్టి డొలకయని, గుంజులేని యుత్తచిప్పయని, ఒకవేళనేమైన మిగిలిన, సంఘసంస్కరణాభిలాషయని చెప్పబడు నొకవిధమైన 'పాకిపని' యని గ్రహించుటకు ఎంతయోకాలము పట్టదు. విషయభోగములే జీవితపరమావధిగా, పరమప్రాప్యముగా నెంచు నిట్టి మతావలంబకులలో ననేకులు బుద్ధిపూర్వకముగానైనను కాకున్నను భౌతికవాదులవర్గములో జేరుదురు. ఇక మానవుని యైహికసౌఖ్యములకు అనుకూలించు వీథులనూడ్చుట, పాకిపని చేయుట మొదలగు ఇష్టాపూర్తకర్మములే మానవజీవిత పరమా వధియని వీరియభిప్రాయము; అజ్ఞానస్వమతదురభిమాన సమ్మి శ్రితమైన యీ విచిత్రపంథ నవలంబించువారు లేనిపోని వేష ములు వేయక నిజరూపమున బాహాటముగావచ్చి భౌతికవాదుల వర్గమున—నాస్తికవర్గమున—ఎంతశీఘ్రముగాజేరిన లోకమునకు అంతశ్రేయస్కరము. వారికిని సముచితమైన కార్యము. రవంత ధర్మానుష్ఠానము—లేశమగు నాత్మానుభూతి—కోట్లకొలది మిట్ట పంచాంగములకంటె మిథ్యావేదాంతములకంటె కోటిరెట్లు ఘన తరము. అజ్ఞానజనితమగు నీ స్వమత దురభిమానమునుండి— శుష్కధర్మోపన్యాసధూళినుండి—బయల్వెడలు నొక్క మహో

జ్ఞలపారమార్థిక ప్రతిభాశాలిని జూపుడు; చూపజాలనియెడల నోరుమూసికొని హృదయకవాటములను దెఱచి దేదీప్యమాన మగు సత్యజ్యోతి నవలోకింపుడు; తమ వాగర్థము నెఱింగిన భారతర్షి వరేణ్యుల పాదసన్నిధిని బాలకులై కూర్చుండుడు. ఇకవారేమిచెప్పెదరో శ్రద్ధతో వినదముగాక.



నాల్గవ అధ్యాయము

## గు రు ని యా వ శ్య క త

ప్రతిజీవియు పరిపూర్ణతగాంచుట విధాయకము, పర్యవసానమున ప్రతిప్రాణియు ముక్తినొందుట విధివిహితము. మన వర్తమానస్థితి పూర్వకర్మముల, పూర్వాలోచనముల, ఫలితము; ఇట్లే మనభావిస్థితి మన ప్రస్తుత కర్మములయొక్కయు భావములయొక్కయు ఫలితము. కానియిట్లు మన భావిస్థితిని నిర్మించుకొనుటనగా ఒరుల సాయము నొందరాదనికాదు భావము; విశేషము, అనేకులకు అట్టిసాహాయ్యము అవశ్యము కావలసియున్నది. అది లభించినప్పుడు ఆత్మశక్తిసామర్థ్యములు ఉద్దీప్తమగును. పారమార్థికజీవితము ప్రబోధమునొందును, తుదకు మానవుడు పావనుడై పరిపూర్ణతనొందును.

పుస్తకములనుండి యీ ఉద్దీపనశక్తిని పొందజాలము,, ఆత్మ మఱియొక ఆత్మవలననే ప్రేరణము నొందగల్గును; వేఱు మార్గము అసాధ్యము. యావజ్జీవము గ్రంథపఠనము చేయుదుముగాక, మహామేధానిధుల మయ్యెదముగాక, కాని తుదకు మనము ఆవంతయు ఆత్మవికాసము నొందలేదని మనకే తెల్లమగును. ధీవికాసమునకు అనురూపమగు నాధ్యాత్మికోన్నతి చేద్దోడు

వాదోడుగా లభించుననుకొనుట (ఎంతయు) సత్యదూరము, గ్రంథపఠనముచే మనము పారమార్థికసాహాయ్యము నొందు చున్నామని యొక్కొక్కప్పుడు భ్రమించుచుందుము; కాని గ్రంథపఠనమువలన మనకు గలుగు ప్రతిఫలమును బరిశీలించి నచో తుదకు దానివలన కొంచెమో గొప్పయో లాభమునొందు నది కేవలము మనధీశక్తికాని అంతరాత్మ మాత్రము కాదని మనకు వెల్లడియగును. ఆధ్యాత్మికవిషయములనుగూర్చి యించు మించుగా ప్రతివ్యక్తియు అత్యద్భుతముగా మాట్లాడగలిగియు, అనుష్ఠానమునకు—నిజమైన పారమార్థికాచరణమునకు—వచ్చు సరికి, ఎంత శోచనీయముగా వెనుకబడియుందుమో మనము ఎఱుగనిదికాదు. ఈ వ్యత్యాసమునకు కారణము గ్రంథపఠనము ఆత్మవికాసము పెంపొందింప జాలకుండుటయే యని చెప్పెదను. ఆత్మజ్యోతి నుద్దీప్తమొనరింపవలయుననిన, తగు ప్రేరణశక్తి మఱియొక ఆత్మనుండి ప్రసరించి తీరవలయును.

ఇట్టి ప్రేరణశక్తి యెవ్వనియందుండి ప్రసరించునో ఆతడే గురువు, దానిని గ్రహించునాతడే శిష్యుడు. ఇటులెవ్వనినైన ప్రేరేపించుటకు అట్టిశక్తిని గలిగియుండవలయుననుట మొదటి విష యము. రెండవది దానిని గ్రహించునాతడు అందులకు అర్హుడై యుండవలయును. బీజము సజీవమై యుండవలయును; క్షేత్రము సాగుచేయబడి సిద్ధముగా నుండవలయును. ఇవిరెండును చేకూఱి నచో పారమార్థికచింత యనుసస్యము అత్యద్భుతముగా ఫలిం చును. "ఆశ్చర్యోవక్తా కుశలోఽస్యలబ్ధా" * —నిజమైనధర్మ ప్రబోధకుడు ఆశ్చర్యకరమగు శక్తులను గలిగియుండవలయును, శ్రోతయు కుశలుడు లభింపవలయును; ఇట్లు ఇరువురును అద్భుత

* కఠోపనిషత్తు (1-2-7).

వ్యక్తులై అసాధారణు లైనపుడుమాత్రమే దివ్యమగు నాత్మ ప్రబోధము ఒదవును. ఇట్టివారే నిజమగు నాచార్యులు, నిజమగు శిష్యులు, నిజమైన జిజ్ఞాసువులు. ఇతరు లందఱకును జిజ్ఞాస యనునది వట్టివినోదము, ఖేలనము. వారిలో ప్రబోధము నొందునది రవంతకుతూహలము, ప్రజ్వలించునది రవంతతార్కిక జ్ఞానము. అంతియేకాని వారు తత్త్వజిజ్ఞాసయను నమృత సాగర మునకు వెలుపల, తీరమునకు ఒకించుక దూరముగా నిలిచి కేక లిడుచున్నారు. ఐననిదియు గొంత ప్రయోజనకరమే; ఏలన, కాలక్రమమున నీ తార్కికవ్యాయామము పారమార్థిక జిజ్ఞాస యను దాహమును బుట్టించును; మఱియు క్షేత్రము సంసిద్ధమై యున్నంతనే బీజమువచ్చిపడును, పడితీరును; ఇయ్యది మనకు అగోచరమగు ప్రకృతిశాసనము. అంతరంగమున నిజమైన జిజ్ఞాస జనించినంతనే అట్టి వ్యక్తికి దొడ్డదుటకై జ్ఞానప్రదాత యగు గురువు కాన్పించును,-కాన్పించితీరును. తాత్త్విక తేజము నాకర్షించుకొనుశక్తి శిష్యునియందు దృఢమై పరిపూర్ణత నొందిన నంతనే దానిని సఫలమొనర్చు శక్తి సహజముగా లభించితీరును.

కాని భక్తిమార్గమున గొన్ని ప్రమాదములు కలవు. ఆచార్యునివలన తత్త్వమును గ్రహించు శిష్యుడు తాత్కాలికా వేశమును—భావావేశమును—నిజమైన జిజ్ఞాసయని భ్రమింప వచ్చును. మనజీవితములందే మనకిది ప్రత్యక్షము. మనము ప్రేమించినవ్యక్తి మరణింప మన గుండె పగులును: సమస్తము మెఱుపుతీగవలె క్షణికమని, నశ్వరమని మనకు దోచును; తుచ్ఛ ప్రాపంచిక విషయములకంటె శాశ్వతమగు పరమార్థమే మనకు వాంఛనీయమనియు వాంఛితమనియు దోచును; ఇక మనము పారమార్థికాసక్తులము కావలయునని మనఃపూర్వకముగా భావిం

తుము. కొన్ని దినములు గడచినంతనే ఆత్మజ్ఞానవైరాగ్యము అంతరించిపోవును; 'ఎప్పటికాలు ఎట్టిట్టే' యనునట్లు మఱల పూర్వస్థితి సంప్రాప్తమగును. ఇట్టి క్షణిక భావావేశమే పారమార్థిక జిజ్ఞాసయని మనము అందఱము తలచు భ్రమపడుచుందుము. కాని యిట్లు భ్రమపడుచున్నంతవఱకు నిశ్చయము, నిరంతరమునైన పారమార్థికపిపాస కలుగనేరదు; అట్టి ప్రబోధమొనరించు నిజమైన యాచార్యుడు లభింపజాలడు. కావున మన సత్యాన్వేషణమంతయు నిష్ప్రయోజనమైనదని వాపోవ బుద్ధి పొడమినపుడెల్ల, అట్లు వాపోవుటకు బదులు, ఆత్మపరీక్ష చేసికొని మనకు నిజమైనజిజ్ఞాస కలదా లేదాయని విచారించుట మన ప్రథమకర్తవ్యము. అటులొనర్చినయెడల నూటికి తొంబదింట తత్త్వజ్ఞానమునకు మనకు ఇంకను అర్హత కలుగలేదనియు మన జిజ్ఞాస నిజమైనదికాదనియు వెల్లడియగును.

తత్త్వోపదేశమొనర్చు గురునివిషయమై ఇంతకంటె గొప్ప ప్రమాదములు కలవు. స్వయముగా అజ్ఞానపంకనిమగ్నులయ్యు గర్వాతిరేకముచే సర్వజ్ఞులమని విఱ్ఱవీగుచు, అంతటితో నాగక, పరులను తరింపజేయుటకై తమభుజము లొడ్డుటకు వెనుదీయక, కానివారు కానివారికి నాయకులై తుదకు వారును వీరును కలిసి గోతిలో పడుచుందురు. "అవిద్యాయా మంతరే వర్తమానాః స్వయంధీరాః పండితంమన్యమానాః జంఘన్యమానాః పరియాంతిమూఢా అంధేనైవనీయమానా యథాంధాః * — మూఢులు అజ్ఞానాంధకారమున గొరాడుచు, మాకంటె ధీరులు లేరని విఱ్ఱవీగుచు, పండితంమన్యులై, గ్రుడ్డివారిచే నడుపబడు

* ముండక. (1-2-8). ఇదియే కఠోపనిషత్తు నందును గలదు, అందు 'జంఘన్యమానాః' అనుటకు బదులు 'దన్ద్రమ్యమాణాః' అనియున్నది.

గ్రుడ్డివారివలె త్రొట్రుపాటునొందుచు పరిభ్రమించుచుందురు.''
ప్రపంచమిట్టి పండితంమన్యులతో నిండియున్నది. ప్రతివ్యక్తికిని తాను ఆచార్యుడను కావలయుననియే తహతహ! ప్రతి యాచకునకును తాను పదిలక్షలు దానము చేయవలయుననియే ఆవేదన! ఈ యాచకులవలెనే ఈ యాచార్యులును నిజముగా హాస్యాస్పదులు.



ఐదవ అధ్యాయము

## గు రు శి ష్య ల క్ష ణ ము లు

ఇక గురుడెవ్వడో, ఎట్టివాడో తెలిసికొనుటెట్లు? స్వయం జ్యోతియగు దినకరుని జూపుటకు దివ్వె తేనక్కఱలేదు. సూర్యుడు ఉదయించినంతనే సహజముగా మనకు గాన్పించును. ఇట్లే ప్రబోధకుడగు నాచార్యుడు మనకు సాయమొనర్ప నేతెంచినంతనే తత్త్వజ్యోతి తనపై కాంతుల నీన మొదలిడినదని ఆత్మకు సహజముగనే తెలియును. సత్యము స్వతఃప్రమాణము, సత్యమును నిరూపించుటకు మఱియొకప్రమాణము అక్కఱలేదు; అయ్యది స్వయంజ్యోతి. సత్యతేజము మన హృదయాంతరాళమునగూడ ప్రవేశించును; దానినిగాంచి లోకమంతయు అంజలి ఘటించి, "ఇదియే సత్యము" అని వక్కాణించును. ఎవ్వారి సత్యనిష్ఠయు జ్ఞానతేజమును భానుదీప్తితో వెల్గొందునో * అట్టి యాచార్యశేఖరులే లోకమునందు అఖండమహిమాన్వితులు; మానవకోటియందు అధికసంఖ్యాకులు వారిని భగవంతునిపోల్కి పూజింతురు. కాని వీరికంటె నించుక తక్కువ వారినుండియు

* "తేషామాదిత్యవజ్ఞానం ప్రకాశయతి తత్పరమ్" — భగవద్గీత.

మనకు సాయము లభింపవచ్చును; విశేషము మనకు మార్గదర్శకుడై ప్రబోధమొనర్చువాని గొప్పతనము సరిగా గ్రహించుటకు తగినంత అంతరవలోకనశక్తి మనయొద్ద లేదు; కావున గురునందు గాన్పింపవలసిన కొన్నిలక్షణములు, ఆతడు పరిపాలింపవలసిన కొన్ని నియమములు ఉండి తీరవలయును; శిష్యుని విషయము నను ఇది వర్తించును.

విశుద్ధత, నిజమైన జిజ్ఞాస, ధృతియనునవి శిష్యునకు ఉండవలసిన ముఖ్యలక్షణములు. అపవిత్రునకు ఎన్నడును ఆధ్యాత్మిక చింత కలుగనేరదు. మనోవాక్కాయములందు పరిశుద్ధత లేనిదే ఎవ్వనికిని పారమార్థిక శీలము పట్టువడదు. జిజ్ఞాసవిషయమై మనము కోరునదేదియో అదియే మనకు లభించుననునది సనాతన నియమము. మన మనను నిలిచినవిషయము లేకాని అన్య మెన్నడును మనకు సంప్రాప్తము కానేరవు. నిజముగా పరమార్థము కొఱకై పరితపించుట దుర్లభము, సామాన్యముగా నిది మనము అనుకొనునంతటి సులభసాధ్యముగాదు. ఉపన్యాసశ్రవణము, తాత్త్విక గ్రంథపఠనము ఉన్నంతనే హృదయమున నిక్కమగు జిజ్ఞాసకలదని నిశ్చయించుటకు వలనుపడదు ; నిజమైన పారమార్థికపిపాస కలుగువఱకు—ఆత్మవిజయము చేకూఱుపర్యంతము, మనలోనున్న పశుస్వభావముతో నిరంతరమైన పోరాటము— మహాకఠినప్రయత్నము— అనవరతమైనయుద్ధము చేయవలయును. ఒకటిరెండుదినములతో తీరిపోవు పనిగాదు ఇది; సంవత్సరములతో సమాప్తముకాదు ; జీవితకాలములుగూడ ఇందులకుచాలవు. జన్మజన్మాంతరములు, జన్మశతములు సైతము ఈ పోరాటమును సాగింపవలసివచ్చును. విజయము ఒకప్పుడ వెంటనే లభింపవచ్చును. కాని పరాంతకాలమైనతోచు పర్యంతము

కూడ ఓరిమితో వేచియుండుటకు సంసిద్ధులవై యుండవలయును. * ఇట్టిపూనికతో సాధనకు గడంగుశిష్యుడు తుదకు విజయమును—సాక్షాత్కారమును బడసితీరును.

గురునివిషయమై, అతడు శాస్త్రార్థ తాత్పర్యములను గ్రహించినవాడై యుండవలయును. లోకముఅంతయు వేదములను, బైబిలులను, కొరానులను జదువును; కాని యవివారికిపట్టి మాటలు, వాక్యాన్వయములు, శబ్దనిష్పత్తులు, శబ్దశాస్త్రములు, తత్త్వశరీరమునందలి యస్థులు. ఎంతసేపు శబ్దవ్యాఖ్యానములతో కాలక్షేపముచేయుచు శబ్దార్థమే పరమార్థమని భావించు గురువు శ్రుతితాత్పర్యమునకు వెలియగును. శ్రుతితాత్పర్యజ్ఞానమే నిశ్చయముగా గురునివిశేషము. మహారణ్యమును బోలు శబ్దజాలమున జిక్కుకొని మనమనమ్ము దారిగానక బాధపడుచుండును. "శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణకారణమ్"; * మఱియు, "వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్రవ్యాఖ్యానకౌశలమ్, వైదుష్యం విదుషాం తద్వద్భుక్తయే నతుముక్తయే"—† అనునట్లు శబ్దముల నొండొంటితో గూర్చు బహురీతులు, వివిధములగు వాక్యాతురీవిధానములు, బహువిధములగు శాస్త్రవ్యాఖ్యానకౌశలములు, ఇవన్నియు పండితుల పాండిత్యప్రకర్షకొఱకు, వినోదముకొఱకు వినియోగించునే కాని మోక్షమునకు వినియోగింపవు. ఇతరులకు మతప్రబోధమొనర్చుటకై యిట్టివిధానములను అవలంబించువారు లోకము తమ్ము ఇంతమహాపండితులు లేరని పొగడుటకై — తమ పాండిత్యము వెల్లడి చేయుటకై —ఆత్రపడుచుందురు.

---

* "ఐహికమప్యప్రస్తుతప్రతిబన్ధే తద్దర్శనాత్."
—బ్రహ్మసూత్రము (3-4-51).

* వివేకచూడామణి, 62. † వివేక చూడామణి, 60.

ప్రపంచమందలి యే మహామతబోధకుడును, ఆచార్యుడును ఈ వ్యాఖ్యానాడంబరములోనికి దిగలేదు. శాస్త్రార్థమును తనకు అనుకూలించునట్లు ఔకమకచేయ యత్నింపలేదు. ఊరక శబ్దార్థ శబ్దనిష్పత్తులతో కాలము గడపలేదు. ఐనను ఇతరులు ఒకశబ్ద మునుగైకొని, దానియుత్పత్తినిగూర్చి—మొట్టమొదట దానిని ఉపయోగించిన వ్యక్తినిగూర్చి—తఱచుగా నాతడు ఏమి భుజిం చెనో, ఎంతసేపు నిద్రించెనో మున్నగు ఘనవిషయములను గూర్చి—మూడుసంపుటముల గ్రంథమును వ్రాయుచుండ నీయా చార్యులు తమయాదార్యమొప్ప లోకమునకు తత్త్వమును బోధించియున్నారు.

శ్రీ రామకృష్ణభగవానుడు ఒక కథ చెప్పుచుండెడి వాడు : కొందఱు ఒక మామిడితోటలోనికి పోయి ఆకులను, కొమ్మలను, చిలవలను పలవలను లెక్కించుచు, వాని రంగులను పరిశీలించుచు, ఒండొంటి పరిమాణములను సరిపోల్చుచు, అతి జాగ్రత్తతో అన్నిటిని సవిమర్శముగా గుర్తించినపిమ్మట వానిలో ప్రతివిషయమునుగూర్చియు తమ పాండితిప్రకాశింప, తమ యానంద మినుమడింప, అఖండచర్చ చేసిరట ! కాని, వారిలో నొకడు—ఇతరులకంటె బుద్ధిమంతుడైనవాడు—ఈనిరుపయోగ చర్చలోనికి దిగక, మామిడిపండు కోసికొని తిన నారంభించెను. నిజముగా ఆతడే కదా బుద్ధిమంతుడు ! కావున నీ శాఖాపత్త్రి గణనములను వాదములను ఇతరులకు విడిచిపెట్టుడు ! ఈ విధ మైన వ్యాపారమునకు ఉచితమైనస్థానము కలదు; కాని పార మార్థికవిషయములలో కాదు. ఈ "ఆకులను లెక్కించువారి" నుండి ఆధ్యాత్మికమహిమాన్వితు లెన్నడును వెలువడినదిలేదు. మానవవైభవమును దెలుపు మహోత్తమాదర్శము, పరమా

వధియు నగు పారమార్థికచింతకు ఇంత ప్రయాసపడ నక్కఱ లేదు. మీరు భోక్తలు కాదలచినయెడల కృష్ణుడు మథురలో పుట్టెనా? వ్రేపల్లెలో పుట్టెనా? అత డేమి చేయుచుండెను? లేక గీతాప్రబోధ మొనర్చిన సరియగు తేదీయేది? ఈవిషయములను మీరు ఎంతమాత్రము తెలిసికొన నక్కఱలేదు. కాని భక్తి యోగమునుగూర్చి, కర్మయోగమునుగూర్చి, గీతలలో జెప్పబడిన మనోహరధర్మములను ఆచరించుటకై వ్యాకులపడుటయే మీకు కావలసినది. గీతలనుగూర్చిన, గీతా కర్తనుగూర్చిన వివరము లన్నియు పండితుల వినోదముకొఱకుగాని మనకుగాదు. వారికి గావలసిన యా యానందము అంతయు వారినే పొందనిండు. వారి ప్రజ్ఞావాదములకు 'శాంతి' చెప్పి మనము 'మామిడిపండ్లను తిందము.'

గురునకు ఉండవలసిన రెండవలక్షణము పావనత్వము, పాపరాహిత్యము. "గురుని శీలమును వ్యక్తిత్వమును మనము పరిశీలింపనేల? ఆతనిబోధనల యోగ్యతను పరిశీలించి వానిని పాలించుటయే మన పని" యని యనేకులు చెప్పుచుందురు. ఇది సరికాదు. భౌతికచలనశాస్త్రమునుగూర్చియో, రసాయనశాస్త్ర మునుగూర్చియో, మఱి యే యితర ప్రకృతిశాస్త్రమును గూర్చియో నాకు ఎవ్వడైనను కొంత బోధింపగోరిన యెడల వాని వర్తనము వాని చిత్తానుసారముగా నుండవచ్చును; ఏలన, ప్రకృతిశాస్త్రములకు గావలసినది బుద్ధికుశలత: కాని ఆధ్యాత్మికవిద్యల విషయమున, మలినహృదయమున ఆత్మవికాసము ఉండుట కలలోనివార్త. మలినహృదయుడు ఏమి మతధర్మములను బోధింపగలడు? చిత్తశుద్ధిలేనివాడా శివపూజచేయుట! పరమార్థమును స్వయముగా గ్రహించుటకుగాని, ఘరులకు

బోధించుటకుగాని ముఖ్యముగా గావలసినది చిత్తశుద్ధి, హృదయ పవిత్రత. భగవద్దర్శనముగాని, పరతత్త్వానుభవలేశముగాని చిత్తశుద్ధిలేనిదే ఎన్నటికిని కలుగదు; కలుగజాలదు. కావున ఆచార్యుని విషయమున ముఖ్యముగా మనము చూడవలసినది 'అతడు ఎట్టివాడు' అను విషయము; అనంతరము 'అతడు ఏమి బోధించుచున్నాడు' అను విషయము. ముమ్మాటికిని అతడు పరిశుద్ధుడై యుండవలయును. లేనిచో వానిమాటలకు విలువలేదు. పరిశుద్ధతలేని ప్రబోధము లేల? మఱియు ఆధ్యాత్మికశక్తి తనకే లేనివాడు పరులకు ఏమి ప్రబోధము ఒనర్పగలడు? స్వయముగా సంపద్విహీనుడు పరులకు ఏమి దాన మొనర్పగలడు? ఆత్మశక్తి ఆచార్యుని హృదయమున స్పందించుచుండవలయును; అట్టియెడ సానుభూతితో నాతడు ఆశక్తినిశిష్యునకు ఒసగగల్గును. ఆచార్యుడగువానివిధి కేవలము శిష్యుని ధీశక్తినికాని, మఱియే యితర శక్తిసామర్థ్యములనుగానిరగుల్కొల్పుటగాదు, దివ్యమగు నొకానొకశక్తిని శిష్యునకు అనువర్తింపజేయుటయే ఆచార్యుని విధి. నిక్కమై, కొనియాడదగిన యొకానొక మహాప్రభావము అతని నుండి వెలువడి శిష్యునిలో ప్రవేశించును. కావున ఆచార్యుడు పరిశుద్ధుడై యుండవలయును.

ఉద్దేశము, లేక మనోభావమునకు సంబంధించినది మూడవ లక్షణము. స్వార్థమును మనసులో నిడుకొని ధనకీర్తులకొఱకై గురువు బోధింపరాదు. కేవల వినిర్మలప్రేమచే, విశ్వమానవ ప్రేమానురాగములచే అతడు బోధనకు బూనవలయును. ప్రేమ ద్వారముననే ఆధ్యాత్మికశక్తి ప్రసరింపగలదు. స్వలాభము, ప్రఖ్యాతి మొదలగు నే స్వార్థచింతయైనను ఉన్నచో వెంటనే ఈ ప్రేమద్వారము భగ్నమగును. భగవంతుడు ప్రేమస్వరూ

వుడు. మఱియు భగవంతు నెవ్వడు ప్రేమమయునిగా నెఱుం గునో అట్టివాడే భగవంతునిగూర్చియు భగవత్తత్వమును గూర్చియు బోధింపగల యాచార్యుడు కాగల్గును.

ఈ లక్షణములు నీ గురునియం దున్న యెడల నీకు శ్రేయస్కరము. లేనిచో అట్టివానివలన నుపదేశము నొందుట అనర్థదాయకము. ఏలన, నీకు ఆతడు సద్బుద్ధిని గలుగజేయకున్న మానెను, దుర్బుద్ధిని గలుగజేయవచ్చును. అది కొఱవితో తలగోకికొనుటవంటిది. ఈ మహావిపత్తునకు పాల్పడకుండ జాగ్రత్తపడుము. "శ్రోత్రియోఽవృజినోఽకామహతో యో బ్రహ్మవిత్తమః" *— శ్రోత్రియుడు, (అనగా వేదశాస్త్రవేత్త) పావనాత్ముడు, కామవిరహితుడు, మఱియు బ్రహ్మవేత్తలలో మేటియనగువాడు—ఇట్టివాడే నిజమైన గురువు.

పైని జెప్పబడిన విషయముల ననుసరించి పరమార్థమును మనము ప్రతివ్యక్తినుండియు, ప్రతిస్థలమునుండియు ఆమోదముతో గ్రహించుటకు సాధ్యముకాదని సహజముగనే వెల్లడియగుచున్నది. "ఱాతిలో నీతియు, మట్టిలో మతమును, అన్నిటిలో మేలును" † అనునది ఎంతయు చక్కని కావ్యాలంకారమగుట నిజము, అంతియే: కాని యెవ్వనికైనను ఇంకను స్వయముగా ఆతని మానసమున తత్వబీజములు అంకురింపనిదే

* వివేకచూడామణి, 34.

† "And this our life exempt from public haunt
Finds tongues in trees, books in the running brooks,
Sermons in stones, and good in everything."
—Shakespeare's 'As You Like It' : II.

తత్త్వమును వానికెవ్వడు నణుమాత్రమైనను బోధింపజాలడు. ఎవ్వనికి ఱాతులు నీతులను బోధించును? మట్టి మతమును బోధించును? ఎవ్వని పావనహృదయారవిందము ఆత్మకిరణ స్పర్శచే వికసించుటకు సిద్ధముగానున్నదో అట్టి వానికి. ఈ హృదయారవిందమును జక్కగా వికసింపజేయునట్టి దివ్యతేజము యోగ్యుడును జ్ఞానతేజస్స్వరూపుడునగు నాచార్యునుండియే సదా వెలువడుచుండును. హృదయ మిట్లు ప్రఫుల్ల మొనర్పబడినంతనే ఱాతులనుండికాని మృత్తికనుండికాని, సూర్యచంద్రతారకలనుండికాని, విష్ణుమయంబగు నీ జగంబున దేనినుండియైన గాని తత్త్వోపదేశమునొందుటకు సమర్థమగును. కాని యిట్లు వికసింపని హృదయమునకో, ఱాయి కేవలము ఱాయిగనే కాన్పించును, మట్టి మట్టిగనే కన్పట్టును. అంతకంటె విశేషము వానిలో గోచరింపదు. చిత్రవస్తుప్రదర్శనశాలకు గ్రుడ్డివాడు వెడలిన, వానికి దానివలన ఆవంతయైనను ప్రయోజనము ఉండునా? ఉండబోదు. మొదట వానికి (మనచేతనైనచో) దృష్టినొసగవలయును. అపుడు అతడు ప్రదర్శనశాలయందలి వస్తువులు ఏమిబోధించునో గ్రహింపగల్గును.

జిజ్ఞాసువు కన్నులను దెఱచువాడు గురువు. పూర్వపురుషునితో ఆతనివంశీయునకుగల సంబంధమే గురునితో శిష్యునకుగల సంబంధము. గురునియెడ మనకు శ్రద్ధ, విధేయత, వినయము, గౌరవము అనునవి లేనిదే ఆముష్మికచింత మన యందు ఎన్నటికిని అభివృద్ధినొందనేరదు. మఱియు నెచట నిట్టి గురుశిష్యసంబంధము విరాజిల్లుచుండునో అచటనే ఆధ్యాత్మిక మహిమాన్వితులు, వేదాంతకేసరులు వెలువడుచున్నారు. ఇక

నిట్టిసంబంధమును యథావిధిగా కాపాడ శ్రద్ధవహింపని దేశ ములలో జరుగుచున్న ముచ్చటయిది : ఆచార్యుడు అచట కేవలము ఉపన్యాసకుడు ఐనాడు ; అతడు తనకు రావలసిన పది రూకలను జూచుకొనుచున్నాడు. శిష్యుడు తన తలను గురు వాక్యములకు అద్దెకిచ్చుచున్నాడు. ఈ మహాకార్యము కాసంత కొనసాగినంతనే ఎవరిత్రోవను వారు ఏగుచున్నారు. ఛేమ్ ! ఇట్టి పరిస్థితులలో ఆధ్యాత్మికచింత సహజముగా అజ్ఞాతవస్తువై పోవుటబ్బురముగాదు. పరమార్థమును బోధించువారు లేరు, వినువారు మునుపే లేరు. ధర్మము ఇట్టివ్యక్తులచేతులలో బడి వర్తకముక్రిందికి దిగినది. డబ్బుతో వీరు ధర్మము ఆర్జింపగోరు దురు. ఆహా ! పరమార్థము ఇంత తేలికగా లభించిన నెంత బాగుండెడిదోకదా ! కాని యిది యంత సులభసాధ్యముగాకుం డుట మన దురదృష్టముకాబోలును !

మహోత్తమమగు తత్త్వజ్ఞానము రూకలచేతను కాసుల చేతను లభించునదిగాదు ; గ్రంథములనుండియు సంపాదింపబడ నేరదు. లోకమును దిగ్దిగంతముల, మూలమూలల, గాలించి చూతువుగాక, హిమాలయములను, ఆల్ప్సు కాకసస్ పర్వత ములను ఎక్కి పరిశోధింతువుగాక ; టిబెట్ దేశములోనికి, గోబి యెడారిలోనికిని బోయి అందలి ప్రత్యణువును పరిశీలింతువుగాక ; పరమార్థము బడయుటకు నీ హృదయము పరిపక్వముగానిదే, నీ గురువు నీకు సంప్రాప్తముకానిదే, ఎచటను లభ్యముకాదు. భగవన్నియమితుడైన యా గురువు అరుదెంచినపుడు బాలుని విశ్వాసమును బోలు విశ్వాసముతో, సరళహృదయముతో నాతని సేవింపుము. అతని మహాప్రభావము నీలో ప్రవేశించు టకై నీ హృదయద్వారమును పూర్తిగా తెఱువుము. సాక్షా

ద్భగవదవతారమూర్తిగా నాతని గనుము. ● ఇట్టి ప్రేమగౌరవములతో, భక్తిప్రపత్తులతో గురుసన్నిధిని సత్యాన్వేషణ మొనర్చువారలకు సత్యనారాయణుడు సత్యశివసౌందర్యములనుగూర్చి మహాద్భుతరహస్యములను వెల్లడించును.

---

## ఆఱవ అధ్యాయము

## అవతారమూర్తులగు గురువులు : అవతారతత్త్వము

భగవన్నామము ఎచట వినబడునో, కీర్తింపబడునో, అదియే పుణ్యస్థలము, పుణ్యతీర్థము. అట్టిచో భగవన్నామోపదేశ మొనర్చు గురువర్యుడు ఎంతటి మహనీయుడో కదా! తత్త్వజ్ఞానము ఎవ్వనివలన మనకు లభించునో అట్టి సద్గురువరేణ్యులు ఈ లోకమున నెంతయు అరుదుగానున్నారు ; ఐనను వారు లేని సమయము మాత్ర మెన్నడును లేదు. మానవజీవితనందనవనమున వారే పారిజాతములు. వారు "అహేతుకదయాసింధువులు." * "ఆచార్యం మాం విజానీయాత్"— "నేనే గురుడనని తెలిసికొనుము" అని శ్రీకృష్ణభగవానుడు భాగవతమున దెలిపియున్నాడు. † ఇట్టి మహనీయులు ఎపుడు లేరో ఆ క్షణమే ప్రపంచము ఘోరనరకమై శీఘ్రముగా నశింప నారంభించును.

---

● శ్లో. "గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః."

* వివేకచూడామణి, శ్లో. 35.

† "ఆచార్యం మాం విజానీయా న్నావమన్యేత కర్హిచిత్ ।
నమర్త్యబుద్ధ్యాసూయేత సర్వదేవమయో గురుః॥"
—భాగవతము (11-17-27).

సామాన్యగురుకోటికంటె నుత్తమము, మహనీయమునగు నాచార్యశ్రేణి లోకమున గలదు. అట్టి గురువరేణ్యులు సాక్షాద్భగవదవతారమూర్తులు. స్పర్శచే, కేవలసంకల్పముచే వారు మనలను పారమార్థికశీలురనొనర్పగలరు. ‡ పరమనికృష్టులు—పతితులు—వారి యాజ్ఞామాత్రమున పరమపావనులగుదురు. వారే గురోర్గురువులు, భగవదవతారమూర్తులు. వారి మూలముననేగాని భగవంతుని జూడజాలము : వారి నారాధింపకుండ నుండజాలము ; నిజముగా వారే మనకు అర్చనీయులు.

అవతారమూర్తులగు నిట్టి గురువుల మూలముననే కాని నిజముగా నెవ్వడు భగవంతుని గనజాలడు. వేఱువిధమున జూడ యత్నించితిమేని, భగవంతునిగూర్చి ఘోర వికృతరూపమును గల్పించుకొని మన కల్పనమే నిజమైన భగవద్రూపమని నమ్ముచుందుము. వెనుకటి కొకకథకలదు. ఒక తెలివితక్కువ నిర్భాగ్యు నెవ్వరో శివవిగ్రహము చేయుమని కోరగా నాతడు అనేక దినములు అఖండ ప్రయత్నముచేసి తుదకు వట్టి కోతి విగ్రహమును జేసెనట! కావున భగవంతుని యథారూపమున మనము అఖండ పరిపూర్ణునిగా భావింప బ్రయత్నించినపుడెల్ల అద్వితీయమగు నపజయమే మనలను వరించును; ఏలన, మనము మానవులమై యున్నంతవఱకు లేక మానవస్వభావముతో గూడుకొని యున్నంతవఱకు భగవంతునిగూర్చి మానవ స్వభావమునకు అతిరిక్తునిగా నెన్నడు భావింపజాలము. మానవ స్వభావాతీతులమై మనము ఆతని యథారూపమున గను సమయము వచ్చును; కాని మానవులమై యున్నంతవఱకు మనము భగవం

‡ శ్రీ రామకృష్ణపరమహంస యిట్టి సద్గురూత్తముడని గ్రహింపవలెను.

తుని మానవునందు—మానవరూపమున—ఆరాధించి తీరవల యును. ఎన్ని జెప్పినను, ఎంత ప్రయత్నించినను, మానవునిగా దక్క భగవంతునిగూర్చి వేఱువిధముగా భావింప జాలము. దేవునిగూర్చియు ప్రపంచమందలి సర్వవిషయములను గూర్చియు ధీనిధులై మహోపన్యాసము లొసగుదురుగాక. మహాతార్కి కులై భగవంతుడు మానవుడై యవతరించెనను సిద్ధాంతము వట్టి ప్రలాపము అని నిరూపింతురుగాక: కాని, అనుభవపూర్వక మగు సామాన్య వివేకదృష్టితో లోకవ్యవహారమును క్షణము పరిశీలించి చూచిన ఈ విధమగు మీ ప్రజ్ఞావిశేషమునకు, పాండిత్యప్రకర్షకు వెనుక నేమున్నది? పూర్ణానుస్వారము, వట్టి గడబిడ, లొడలొడ. అవతారారాధనమును నిరసించుచు నెవ్వడైన మహోపన్యాసము చేయుచుండగా మఱల మీరు వినుట తటస్థించినప్పుడు ఆతని దొరకబుచ్చుకొని, భగవంతుని గూర్చి వాని యభిప్రాయము ఏమో, "సర్వశక్తిమత్త్వము" "సర్వవ్యాపకత్వము" మొదలగు మాటలకు వర్ణక్రమమును మించి వాని కేమి తెలియునో అడుగుడు. నిజముగా వీనినిగూర్చి వాని కేమియు తెలియదు, తెలియనే తెలియదు; మానవస్వభావ బాధితముకాని యెట్టితలంపును ఆ పదములనుగూర్చి వానికి తట్టదు; ఇవ్విషయమై అక్షరజ్ఞానములేని గ్రామీణునికంటె వాడు ఎంతమాత్రము అధికుడుగాడు. ఏమైనను ఆ గ్రామీణుడు నెమ్మదిగా నుండును: తన వాగాడంబరముచే లోకులను కలవర పెట్టడు. ఇక నీ మహాప్రలాపి లోకమునందు అశాంతిని, దుఃఖమును దెచ్చిపెట్టును. ఎన్నిచెప్పినను సాక్షాత్కారమే మత ధర్మము. వాచాలతకును ఆత్మానుభూతికిని గల వ్యత్యాసమును మనము చక్కగా గమనించుట పాడి. హృదయాంతరాళమున

మనము పొందు ననుభూతియే సాక్షాత్కారము. ఇవ్విషయమున సామాన్య వివేకమే ఎంతయు అసామాన్యమైనది.

సావధికమగు మన ప్రస్తుతావస్థలో భగవంతునిగూర్చి మానవ రూపముననేగాని భావింపజాలము. మాటవరుసకు, దున్నపోతులు దేవు నారాధింప గోరునెడల తమ స్వభావము ననుసరించి యవి దేవునొక బ్రహ్మాండమైన దున్నపోతుగా భావించును; ఒకచేప భగవంతు నారాధింప గోరునెడల, భగవంతుడు ఒకపెద్ద చేపయని భావింపక తప్పదు; ఇట్లే మానవుడు దేవునిగూర్చి మనుష్యునిగా భావించును; భావింపవలసియున్నది. ఈ భావనలన్నియు చంచలము, వికృతమునగు నూహలుగావు. మానవుడు, దున్న, చేప—ఇవియన్నియు (భగవంతుడను నమృతమును గ్రహించు) వివిధపాత్రములని ఊహింపనగును. ఈపాత్రలన్నియు తమతమ రూపసామర్థ్యముల ననుసరించి అమృతపూరితము లగుటకై భగవత్సాగరమునకు బోవును; మనుష్యునందీ యమృతము మానవరూపమును, దున్నయందు దున్నరూపమును, మత్స్యమునందు మత్స్యరూపము నొందును. ఈ పాత్రలొకొక్కదానియం దున్నది భగవత్సాగరామృతమే. మనుష్యులు భగవంతుని గాంచునప్పుడు మానవునిగను, జంతువులకు ఏమైన భగవద్భావమున్నచో భగవంతు నవి జంతువుగను— ఈ విధముగా వానివాని యాదర్శసామర్థ్యముల ననుసరించి భగవంతుని గాంచవలసియుండును. కావున దేవుని మనము మానవునిగా గ్రహింపకుండ నుండజాలము; అందుచే మానవరూపమున మనము అతని నారాధింపవలసి యున్నారము. వేఱు మార్గము లేదు.

ఇరు తెఱగులగు మానవులు భగవంతుని మానవునిగా నారాధింపరు—అసలు పారమార్థిక చింతయే లేని మానవపశువు ఒకడు, మానవ సమస్తదోషాతీతుడై, మానవస్వభావాతీతుడగు పరమహంస యొకడు. పరమహంసకు సమస్తప్రకృతియు నాతని యాత్మయే. అతడే యథారూపమున భగవంతు నుపాసించుటకు సమర్థుడు. ఇతరవిషయము లన్నిటియందువలెనే ఇచటను పరమ నీచోచ్చస్థితులు సమముగా నున్నట్లు గాన్పించును. పరమ జ్ఞానులు, పరమమూఢులు అను నిరుతెగలవారును భగవంతు నుపాసింపరు. అజ్ఞానముచే మానవపశువు ఉపాసింపడు, జీవన్ముక్తులు తమయందే భగవత్సాక్షాత్కార మొందుటచే నుపాసింపరు. అత్యంతమైన ఈ రెండుస్థితులకును మధ్యనున్నవాడు ఎవ్వడైనను భగవంతుని మానవరూపమున తాను ఆరాధింపనని మీకు జెప్పినచో ఆ వ్యక్తివిషయమున ప్రేమతో తగు శ్రద్ధ వహింపుడు. ఆతడు తనబాధ్యత నెఱుగని కేవల ప్రలాపి—ఇంతకంటె కఠినమైనపదము ఉపయోగింప దలచుకొనలేదు—ఆతని మతము మట్టిబుఱ్ఱలకు, మతిలేనివారికే కాని ఇతరులకు గాదు.

మానవుని లోపములను, అసమర్థతను గ్రహించి, కరుణా పయోనిధి యగు భగవానుడు లోకకల్యాణమునకై మానవ రూపమున నవతరించును. "యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత। అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥ *—ఎప్పుడెప్పుడు ధర్మము క్షీణించి, అధర్మము వృద్ధినొందునో అప్పుడెల్ల నే

* భగవద్గీత (4-7, 8).

నవతరింతును. ధర్మ సంస్థాపనముకొఱకు, అధర్మ నాశనము కొఱకును యుగయుగములందు నేను అవతరించెదను." "అవ జానంతిమాం మూఢా మానుషీంతను మాశ్రితమ్, పరంభావమ జానన్తో మమభూత మహేశ్వరమ్॥ *—నేను జగదీశ్వరుడననునట్టి నా తత్త్వమును గ్రహింపక మూఢులు నన్ను అవజ్ఞ చేయుదురు." అవతారతత్త్వమును గూర్చి శ్రీ కృష్ణుని ప్రతిజ్ఞాపూర్వక వాక్యములివి. మఱియు శ్రీ రామకృష్ణభగవానుడిట్లు వచించెను : "పెద్ద వరద వచ్చినప్పుడు స్వయముగా నెట్టి ప్రయత్నము, ఎఱుకయు లేకయే చిన్నచిన్న దొరువులును గుంటలును బాగుగా నిండును. ఇట్లే అవతారపురుషుడు ఆవిర్భవించినపుడు ఆధ్యాత్మిక సంపదయను వెల్లువ ప్రపంచమును ముంచివెత్తును, అపుడు ఆధ్యాత్మికచింతన జనుల మానసములను ఆవరించును."



ఏడవ అధ్యాయము

## మంత్రము: ఓంకారము: శబ్దము: జ్ఞానము

కాని యిపుడు మనము అవతారమూర్తులగు మహాపురుషుల విషయము నటుంచి సిద్ధగురులనుగూర్చి విచారణ సల్పుదము; సర్వసాధారణముగా మంత్రమూలమున వీరు శిష్యహృదయమున తత్త్వజ్ఞానబీజములను నాటుదురు. శిష్యులు ఆ మంత్రమును ధ్యానింపవలయును. మంత్రమనగా నేమి? హైందవ తత్త్వశాస్త్రము ననుసరించి యీ ప్రపంచము అంతయు నామరూపముల మూలమున వ్యక్తమగుచున్నది. నామరూపబద్ధము గాని యెట్టి చిత్తవృత్తియు పిండాండమం దుదయింపజాలదు.

* భగవద్గీత (9-11).

ఈ పద్ధతి ననుసరించి ప్రకృతి నిర్మితమగుట నిజమగునేని అశేష బ్రహ్మాండమును ఇట్లే నామరూపబద్ధమై నిర్మితము కావలయును. "యథాసోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్ *—ఒక మట్టిముద్ద యెట్టిదో తెలిసికొన్నచో మృణ్మయములగు వస్తువులన్నియు నెట్టివో తెలియును." ఇట్లే పిండాండ జ్ఞానము బ్రహ్మాండజ్ఞానము నందుటకు మార్గదర్శకమగును. రూపమనునది చిప్ప యనుచో నామము లేక భావము అందలి గుంజు అనవచ్చును. శరీరమే రూపము, మనస్సు లేక అంతః కరణమే నామము. మఱియు శబ్దములు వాక్ఛక్తిగల జీవులందఱియందును నామముతో అవినాభావసంబంధము గలిగియున్నవి. వ్యక్తియందు పరిమితమగు మహత్తున లేక చిత్తమున నుదయించు వృత్తులు మొదట శబ్దములుగను తరువాత అంతకంటె విశిష్టాకృతితో నొప్పు ప్రత్యేక రూపములుగను వ్యక్తమగుచున్నవి.

విశ్వమున హిరణ్యగర్భుడు అనబడు బ్రహ్మ లేక మహత్తత్త్వము మొదట నామముగను, అనంతరము రూపముగను అనగా ఈ జగద్రూపమున వ్యక్తమైయున్నది. ఇట్లు వ్యక్తమై ఇంద్రియగోచరమగు ఈ విశ్వమే రూపము; అనిర్వచనీయము, నిత్యము నగు స్ఫోటము లేక శబ్దమే దీనికి ఆధారభూతమై యున్నది. సమస్త భావములకును నామములకును శాశ్వత మూలవస్తువగు ఈ స్ఫోటము పరమేశ్వరుని జగద్రచనకు ఆధారభూతమగు మూలశక్తి; విశేషము, పరమేశ్వరుడు మొదట స్ఫోటరూపబద్ధుడై అనంతరము విశిష్టమైన ఈ యింద్రియగోచర విశ్వరూపముగా పరిణమించును. ఈ స్ఫోటమునకు ఒకే సంజ్ఞ

* ఛాందోగ్య. (6-1-4).

కలదు; అదియే ఓంకారము. మఱియు వాగర్థములు ఎట్లు సదా అవిభాజ్యములో ఓంకారమును నిత్యమైన యీ స్ఫోటమును అట్లే అవిభాజ్యములు. కావున పరమపవిత్రము, సమస్త నామరూపములకును తల్లియు శాశ్వతమునైన యీ ఓంకారము నుండియే ప్రపంచము అంతయు నిర్మితమైనదని భావింపనగును. వాగర్థములు అవిభాజ్యములు అయ్యును ఒకేభావమును దెలుపుటకు అనేక శబ్దములు ఉండవచ్చును. కాన జగదుత్పాదన హేతువగు భావమును దెలుపుటకు ప్రత్యేకమయిన యీ ఓంకారము ఒక్కటియే సంజ్ఞ కానక్కఱలేదని చెప్పవచ్చును. ఓంకారము ఒక్కటియే శబ్దజాలమునకు అంతకును ఆధారభూతమగు సంజ్ఞయనియు ఇట్టిది వేఱొకటి లేదనియు నిందులకు మా సమాధానము. సమస్తశబ్దములకును స్ఫోటమే మూలమయ్యును, ఇయ్యది రూపొందిన యే ప్రత్యేకశబ్దమును మాత్రము కాదు. అనగా ఒకశబ్దమును వేఱొకదానినుండి వేఱుపఱుచు వైచిత్ర్యముల నన్నిటిని తొలగించినపుడు ఏది మిగులునో అదియే స్ఫోటము; అందుచే ఈ స్ఫోటము నాదబ్రహ్మమని చెప్పబడుచున్నది. ఇపుడు అనిర్దిష్టమైన యీ స్ఫోటమును నిర్దేశింపజూచు ప్రతిశబ్దమును ఇక నది స్ఫోటము గాకుండునట్లు ప్రత్యేకించుచుండుటచే, ఏ శబ్దము దాని నత్యంతసూక్ష్మముగా ప్రత్యేకించునో, మఱియు దోడ్తోడనే దాని తత్త్వమును సాధ్యమైనంతవఱకు చక్కగా వెల్లడించునో అదియే దాని నిజమైన సంజ్ఞ; అదియే ఓంకారము—మఱియొకటికాదు—ఏలన అ, ఉ, మ్ అను నక్షరములను జేర్చి యుచ్చరించునపుడు ఏర్పడు ఓంకారము సమస్తశబ్దములకును సామాన్యమగు సంజ్ఞ కానొప్పును. అక్షరము లన్నిటిలో అకారము మిక్కిలి తక్కువగా ప్రత్యేకింపదగిన

శబ్దము; ఇందుచేతనే "అక్షరాణాం అకారోఽస్మి" * యని శ్రీ కృష్ణుడు గీతలలో దెల్పియున్నాడు. మఱియు నుచ్చరింపదగిన శబ్దములు అన్నియు జిహ్వామూలమునుండి పెదవులవఱకును గల తావుననే జనించుచున్నవి. కంఠస్థానమున జనించు శబ్దమే అకారము, పెదవులకడ బయల్వెడలు శబ్దము మకారము; మఱియు జిహ్వామూలమున నారంభమై పెదవులయొద్ద నంతమగు వఱకును ధ్వనించు శబ్దముయొక్క వ్యాప్తిని సరిగా ఉకారము వెల్లడించును. తగురీతి నుచ్చరించిన యెడల ఈ ఓంకారము శబ్దోచ్చారణ ప్రక్రియనంతను దెలుపును; ఈ కార్యము ఏ యితరశబ్దమునకును సాధ్యముకాదు; కావున నిది స్ఫోటమునకు అత్యంత యోగ్యమగుసంజ్ఞ. స్ఫోటమే నిజముగా ఓంకారము యొక్క తాత్పర్యము. మఱియు శబ్దము అయ్యది తెలుపు వస్తువునుండి సదా అవిభాజ్యమై యుండుటచే ఓంకారమును స్ఫోటము నొక్కటియే. మఱియు స్ఫోటము ఈ దృశ్యప్రపంచ మునకు సూక్ష్మస్థితికావున నియ్యది భగవంతునకు అత్యంత సన్నిహితమైయున్నది. మఱియు తత్త్వజ్ఞానము మొదట స్ఫోటరూప మున వ్యక్తమగుచుండుటచే ఈ ఓంకారము నిజముగా పరమేశ్వర చిహ్నమనదగియున్నది. మఱియు అద్వితీయము, అఖండ సచ్చిదానందమయమునగు బ్రహ్మమును అపరిపూర్ణులగు మానవులు పరిమితము, ప్రత్యేకమునగు తమ ధీశక్తికి అనుగుణముగా మాత్రమే గ్రహించుచుండుటచేతను, బ్రహ్మమును ప్రత్యేక గుణవిశిష్టముగా భావించుచుండుటచేతను, బ్రహ్మశరీరమగు ఈ

* భగవద్గీత (10-33).

విశ్వమునుగూర్చియు నిట్లే తమ ధీశక్తికి అనురూపముగా భావింప వలసి యున్నారు. †

భక్తుడు తన మనస్తత్వము ననుసరించి భగవాను నుపాసించుచుండును. ఫలితమేమన, ఒకే భగవంతుడు వివిధనామ రూపములతో, వివిధగుణములతో ఉపాసకులకు గోచరించును. ఇట్లే ఒకే విశ్వము మన దృక్పథము ననుసరించి బహువిధములుగా గన్పట్టును. సమస్తవేదాంత సమ్మతము, అత్యల్పముగా పరబ్రహ్మమునుండి భిన్నమున్నైన ఓంకారమున శబ్దము, అర్థము నెట్లు అన్యోన్య సంబంధము—అవినాభావసంబంధము—నొంది యున్నవో అట్లే విశ్వమునుగూర్చియు, విశ్వేశ్వరునిగూర్చియు తత్త్వార్థులకు గల వివిధభావములు అన్యోన్యసంబద్ధములై యున్నవి. కావున వీనిలో నొక్కొక్క భావమును దెలుపుటకు ఒక్కొక్కశబ్దము ఉండవలయును. ఋషీశ్వరతత్త్వానుభవసంజనితములైన యీ శబ్దములు లేక మంత్రములు లోకమును గూర్చియు, లోకేశునిగూర్చియు తత్త్వాన్వేషకుల వివిధసంప్రదాయములను లేక దృక్పథములను దెలుపును. కాని యీ తెలుపుటనునది సాధ్యమైనంతవఱకే యని గుర్తింపవలయును. అఖండమగు బ్రహ్మమునకు ఓంకారము సంజ్ఞయైనరీతినే * ఇతర సంజ్ఞలు లేక మంత్రములు వివిధములగు సగుణబ్రహ్మభావములను దెలుపును. ఇవియన్నియు ధ్యానమునకును తత్త్వజ్ఞానసముపార్జనమునకును మనకు దోడ్పడును.

---

† బ్రహ్మమునుగూర్చిగాని, విశ్వమునుగూర్చిగాని యథారూపమున భావించుట దుర్లభమని భావము.

* "తస్య వాచకః ప్రణవః"—పాతంజలయోగసూత్రము.



## ఎనిమిదవ అధ్యాయము

## ప్రతిమారాధన : ప్రతీకోపాసన

ప్రతిమారాధన ప్రతీకోపాసనలనుగూర్చి మనము ఇక పర్యాలోచింపవలసియున్నది. భగవంతునకు ఇంచుమించుగా ప్రత్యామ్నాయములే ప్రతీకములు; మఱియు ప్రతిమ లనగా విగ్రహములు. ప్రతీకముమూలమున భగవంతు నుపాసించు టనగా నేమి? "అబ్రహ్మణి బ్రహ్మదృష్ట్యనుసంధానమ్"— బ్రహ్మము కానిదానిని బ్రహ్మముగా భావించి భక్తితో దాని యందు మనసు లగ్నము చేయుటయే యని రామానుజభగవానుడు నిర్వచించియున్నాడు. * మనస్సే బ్రహ్మముగా భావించి యుపాసింపుము, ఇది యాధ్యాత్మికము; ఇట్లే ఆకాశమే బ్రహ్మమనునది ఆధిదైవికము—అనగా దేవతలను గూర్చినట్టిది. † మనస్సు ఆంతరప్రతీకము, ఆకాశము బాహ్యప్రతీకము; రెంటినిగూడ భగవత్ప్రత్యామ్నాయములుగా గైకొని యుపాసింపవలయును. ఇట్లే శంకరాచార్యు డిట్లు వచించును : " 'ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః' ‡—సూర్యుడే బ్రహ్మము, ఇది (వేద) శాసనము... 'నామమే బ్రహ్మముగా నెవ్వడు ఉపాసించునో...'—ఇట్టి ప్రవచనము లన్నిటియందును ప్రతీకోపాసనమునుగూర్చి సంశయము ఉదయించును."@ 'ప్రతీకము అను పదమునకు 'ఉన్ముఖమగుట'

---

* బ్రహ్మసూత్ర రామానుజభాష్యము (4-1-4).

† "మనో బ్రహ్మేత్యుపాసీతే త్యధ్యాత్మ మథాధిదైవత మాకాశో బ్రహ్మేతి."—ఛాందోగ్య.

‡ ఛాందోగ్య.

@ " 'సయో నామ బ్రహ్మేత్యుపాస్తే' ఇత్యేవ మాదిషు ప్రతీకోపాసనేషు సంశయః."—బ్రహ్మసూత్ర శంకరభాష్యము (4-1-4).

యని యర్థము. ఒక్క విషయమునగాని, అనేక విషయములందు గాని విశేషముగా బ్రహ్మమువంటిదయ్యు బ్రహ్మము కానట్టి యేదియో యొక వస్తువును లేక తత్త్వమును బ్రహ్మమునకు ప్రతిగా నుపాసించుటయే ప్రతీకోపాసన. శ్రుతులలో జెప్పబడిన ప్రతీకములతో పాటు పురాణములందును తంత్రములందును వివిధములగు నితర ప్రతీకములనేకములు గాన్పించును. బహువిధములగు పితృదేవతారాధనము, దేవతారాధనముగూడ ఈ ప్రతీకోపాసనయందే జేరును.

భగవాను ననన్యభావముతో నారాధించుటయే భక్తి యనబడును. దేవతలనుగాని, పితృదేవతలనుగాని, మఱి వేనిని గాని ఆరాధించుట భక్తి యనిపించుకొనజాలదు. వివిధములగు దేవతోపాసనలన్నియు కర్మకలాపమున జేరును. ఉపాసకునకు ఏ దివ్యభోగమునో ఇచ్చుచు అవి ప్రత్యేక ఫలదాయకమగునే కాని భక్తిముక్తుల నొసగజాలవు. కావున మనము ఒక విషయమును బాగుగా గుర్తింపవలయును. పరమతాత్త్వికాదర్శము అగు బ్రహ్మమును ప్రతీకోపాసనామూలమున ప్రతీకస్థితికి దింపి, సాక్షాత్ప్రతీకమునే ఉపాసకుడు తన యంతరాత్మగా భావించినచో అట్టి యుపాసకుడు పూర్తిగా పెడత్రోవ ద్రొక్కుచున్నాడు : ఏలన, ఏ ప్రతీకమును నిజముగా ఉపాసకుని ఆత్మకాజాలదు. కాని బ్రహ్మమే ఉపాసకునకు లక్ష్యమై, ప్రతీకము అందులకు కేవలము ప్రతిగా నున్నప్పుడు—అనగా సర్వవ్యాపకమగు బ్రహ్మము ప్రతీకమూలమున ఉపాసింపబడినప్పుడు, ప్రతీకమే మూలకారణమగు బ్రహ్మముగా భావింపబడినప్పుడు—ఆ యుపాసన నిజముగా క్షేమకరము అగును; క్షేమకరమననేల! ఉపాసనలో సాధనదశ నతిక్రమించు పర్యంతము సమస్తమానవులకును అట్టి యుపాసన

అత్యావశ్యకము, విధ్యుక్తము. కావున దేవతలుగాని, ఇతర గణములుగాని స్వయముగా ఆరాధింపబడినపు డది కేవలకర్మ కలాపమేయగును. విద్యారూపమున అది ప్రత్యేకమైన యా విద్యయొక్క ఫలమునొసగును; కాని దేవతలుగాని మఱియెవ్వరు గాని బ్రహ్మభావముతో నుపాసింపబడినయెడల బ్రహ్మోపాసనా ఫలితమే సిద్ధించును. పెక్కు సమయములందు ఒక దేవతనో, ఋషినో, మఱి యే యితర దివ్యపురుషునో గైకొని వానిస్వభావమునుండి ఉత్తీర్ణునిజేసి మఱి బ్రహ్మభావముతో నుపాసించుచున్నట్లు శ్రుత్యాదులలో గానవచ్చుచుండుటకు ఇదియే కారణము. "నామరూపములను దొలగించినపుడు సర్వము బ్రహ్మమే కదా" యని యద్వైతి వచించును. "ప్రతి జీవియందును అంతరాత్మ యగువాడు పరమేశ్వరుడే కదా" యని విశిష్టాద్వైతి నుడువును. ఇవ్విషయమునుగూర్చి శంకరాచార్యుడు తన బ్రహ్మసూత్రభాష్యమున నిట్లు వచించుచున్నాడు : "ఫల మతిథ్యాద్యుపాసన ఇవాదిత్యాద్యుపాసనేపి బ్రహ్మైవ దాస్యతి సర్వాధ్యక్షత్వాత్ —ఆదిత్యాదుల నుపాసించుటవలని ఫలముగూడ బ్రహ్మమే ఇచ్చుచున్నాడు; ఏలన సర్వాధ్యక్షుడు బ్రహ్మమే." మఱియు, "ఈదృశం చాత్ర బ్రహ్మణ ఉపాస్యత్వం యత్ ప్రతీకేషు తద్దృష్ట్యాధ్యారోపణం ప్రతిమాదిషు ఇవ విష్ణ్వాదీనామ్ * — విష్ణ్వాదిమూర్తులు ప్రతిమలయందు ఆరోపింపబడిన చందమునసే బ్రహ్మము ప్రతీకములందు అధ్యారోపింపబడిన కారణమున ఇచట నీ విధముగా ఉపాస్యుడు అగుచున్నాడు."

ప్రతీకోపాసనమునుగూర్చి పైని దెలుపబడిన భావములే ప్రతిమారాధనవిషయము ననువర్తించును; అనగా ప్రతిమ యొక

* బ్రహ్మసూత్ర శంకరభాష్యము (4-1-5).

దేవతకో, మహాపురుషునకో ప్రతిగా గైకొనబడినయెడల అట్టి యారాధన ముక్తి నొసగజాలదు; కాని పరమేశ్వరునికే ప్రత్యామ్నాయమైన పక్షమున భక్తిముక్తుల రెంటి నొసగును. ప్రపంచమందలి ప్రధానమతములలో వేదాంతమతము, బౌద్ధమతము, క్రైస్తవమతమున గొన్ని సంప్రదాయములును ఉపాసనలో విరివిగా విగ్రహములను ఉపయోగించును; మహమ్మదీయమతమును ప్రొటెస్టెంటుమతమును మాత్రమే ఇట్టిసాహాయ్యము నంగీకరింపవు. కాని మహమ్మదీయులును తమ మహాపురుషులయొక్కయు, స్వమతరక్షణార్థము ప్రాణములను అర్పించిన మహనీయులయొక్కయు గోరీలను కొంచెము ఇంచుమించుగా విగ్రహస్థానమున నుపయోగించుచున్నారు; ఇక ప్రొటెస్టెంటులన్ననో ప్రత్యక్షసాహాయ్యముల నన్నిటిని నిరాకరించుటచే నానాటికి పరమార్థమునకు దూరస్థులగుచున్నారు. తుదకు నేడు ముందంజవేయుచున్న ప్రొటెస్టెంటులకును అగస్టుకాంట్ * యొక్క అనుచరులకు లేక నీతిశాస్త్రమును మాత్రమే బోధించు అజ్ఞేయవాదుల (Agnostics) కును † భేదమేమియు గాన్పించుటలేదు. మఱియు క్రైస్తవ మహమ్మదీయ మతములలో ఏమాత్రము ప్రతిమారాధనము నిలిచియున్నను అయ్యది భగవద్దర్శనసౌకర్యార్థముగాక కేవలము ప్రతిమనే అర్చించు విధానములో జేరుచుండుటచే ఉత్తమ

---

* August Comte — ఈతడు ఫ్రాన్సుదేశపు తత్త్వజ్ఞుడు. ఈతని జీవితకాలము క్రీ. శ. 1798 మొదలు 1857. దృశ్యమానమగు భౌతికప్రపంచముయొక్క నియమములను మాత్రమే మానవుడు గ్రహింపగలడని యీతని వాదము. మఱియు మనుష్యత్వమును మించిన తత్త్వమేలేదని యీతని మతము.

† ఈశ్వరుని అస్తిత్వమునుగాని నాస్తిత్వమునుగాని నిరూపింపజాలమను అజ్ఞేయవాదమునకు జెందినవారిలో స్పెన్సర్, హక్స్లీ, ఇంగర్‌సాల్ (Spencer, Huxley, and Ingersol) అనువారు ముఖ్యులు.

పక్షము అయ్యది కర్మకలాపముగా నుండి భక్తినిగాని ముక్తిని గాని గలుగజేయు నసమర్థమగుచున్నది. ఈవిధమగు ప్రతిమారాధనమున భగవదితరములగువానికే అంజలి ఘటింపబడుటచే ప్రతిమలనుగాని, గోరీలనుగాని, దేవళములనుగాని, సమాధులను గాని ఇట్లు వినియోగించుటనే నిజమైన ప్రతిమారాధనయని చెప్ప వలయును. స్వయముగా నిది పాపముగాదు, దుష్కార్యమును గాదు—మఱియేమన కేవలము ఇది కర్మము; ఇట్టి కర్మ నవలంబించువారు తదనుగుణమగు ఫలము నొందుదురు అనుటకు సందియము లేదు.

---

## తొమ్మిదవ అధ్యాయము

## ఇ ష్ట దై వ ము

మనము ఇక పర్యాలోచింపదగిన విషయము ఇష్టనిష్ఠ. భక్తిసాధకుడు "మతము లెన్నో పథములన్ని" * యను విషయమును గుర్తింపవలయును. వివిధమతములందలి వివిధ సంప్రదాయములన్నియు ఒకే భగవంతుని వైభవమును బహు విధములుగా ప్రకటించునని గ్రహింపవలయును. శ్లో. "నామ్నామకారి బహుధా నిజసర్వశక్తి స్తత్రార్పితానియమితః స్మరణే న కాలః । ఏతాదృశీతవకృపా భగవన్ మమాపి దుర్దైవమీదృశ మిహాజని నానురాగః॥ † —బహునామములతో నిన్ను

* ఇయ్యది శ్రీరామకృష్ణపరమహంసోపదేశములలో ముఖ్యమైనది. శ్రీ పరమహంస వంగభాషలో "యత మత తత పథ" యనివచించును. "...ఋజుకుటిల నానాపథజుషామ్..." అను శివమహిమ్నస్తోత్రసారము నిదియే.

† శిక్షాష్టకము, శ్రీకృష్ణచైతన్యకృతము.

బిలుచుచు బహునామములచే వారు (భక్తులు) నిన్ను విభజించు చున్నారు; కాని వీనిలో నొక్కొక్క నామమందును నీ సర్వ శక్తిమత్త్వమే గోచరించుచున్నది—వీని యన్నిటిమూలమునను నీవు ఉపాసకుని ప్రాపించుచున్నావు. మానసమున నీపై గాఢాను రక్తి యున్నంతవఱకు (నిన్ను బొందుటకు) కాలనియమమనునది లేదు ; నీవు అంతటి సులభుడవు. ఐనను నిన్ను ప్రేమింపజాల కుంకుట కేవలము నా దురదృష్టము.'' అంతియేగాక వివిధమత సంప్రదాయకర్తలగు మహానీయులను—తేజోమూర్తులగు సమ్మాత పుత్త్రిలను—భక్తుడగువాడు ఎన్నడు లేశమును ద్వేషింపరాదు; మఱి వారల చారిత్రమును విమర్శింపరాదు ; దుర్మార్గులు వారిని నిందించుతఱి అట్టి నిందావాక్యములను సైతము వినరాదు. జగద్వ్యాప్తమగు సానుభూతిని, పరగుణాభినందనశక్తిని, వీనితో బాటు గాఢమగు ప్రేమను గలిగియుండు టెంతయు దుర్లభము ; అట్టివారు అరుదుగానుందురు. ఉదారభావములతో—సర్వజన సానుభూతితో — గూడిన సంప్రదాయములందు పారమార్థిక దీక్షయు, తీవ్రతయు సర్వసాధారణముగా కొఱవడియుండుటయే గాక అందలి మతధర్మములు ప్రాయికముగా ఒకవిధమగు రాజకీయ సాంఘిక లౌకికజీవితమునకు దిగుచుండును. ఇది యిట్లుండ, అత్యంతసంకుచితాభిప్రాయములతో గూడిన సంప్ర దాయములు స్వీయాదర్శములయెడ 'సెబాస్' అనదగిన ప్రేమను అగపఱచుచుండియు, ఆప్రేమనంతను తమ యభిప్రాయ ములతో నేకీభవింపని ప్రతివ్యక్తిని ద్వేషించుటచేతనే సంపా దించుచున్నట్లు కాన్పించును. జగద్వ్యాప్తమగు సానుభూతిని దివ్యప్రేమానురాగములతో మేళవించు మహానీయులు ఈప్రపంచ మున వెల్లివిరిసిన నెంతచక్కగా నుండునోకదా! కాని యిట్టి

వారు అరుదుగాకాని లేరు. ఐనను గాఢమగు మతభక్తిని సర్వజనసానుభూతితో జతపఱుచు నీయాదర్శమునందు అనేకులను సుశిక్షితుల నొనర్పవచ్చును ; ఇష్టనిష్ఠయే యిందులకు మార్గము. ప్రతిమతమును స్వీయమగు నేదియో యొకయాదర్శమును మాత్రమే లోకమునకు బ్రకటించును. కాని శాశ్వతమగు వేదాంతమతము దివ్యాత్మమందిరప్రవేశమునకు అనువగు ననంత ద్వారములను దెఱచుచు సచ్చిదానందస్వరూపుని బ్రకటించు ననంతాదర్శములను మానవకోటికి జూపుచున్నది. భూతవర్త మానములలో భగవత్ప్రవృత్తులై లేక భగవదవతారమూర్తులై వెలయు మహనీయులు మానవజీవితతత్త్వ మను శిలనుండి నిర్మించిన బహువిధ దివ్యమార్గములను అత్యంతప్రేమానురాగ ములతో సాధకులకు జూపుటయేగాక, ఆత్మసామ్రాజ్యమునకు— ఎచట మాయాతీతమై జీవాత్మ నిత్యానందస్వాతంత్ర్యముల నోలలాడునో అట్టిదివ్యాత్మసామ్రాజ్యమునకు—సమస్తజనులను, ఇక జన్మింపబోవువారినిగూడ నాహ్వానించుటకై వేదాంతమతము చేతులుచాచుకొని వేచియున్నది.

కావున మోక్షసాధమునకు గొనిపోవు బహువిధమార్గ ములలో దేనిని, "కాదు అనరాదు" అని, ద్వేషింపరాదని, భక్తిమార్గము చాటుచున్నది. ఐనను ఎదుగుచున్న మొక్క చెట్టు అగువఱకు దాని సంరక్షణార్థము చుట్టును కంచె వేయ వలయును. పారమార్థికచింత యను లేతమొక్క ఆశయములను ఆదర్శములను సదా మార్చుకొనుట యను ప్రబలవాయువులకును వర్షపాతమునకును వెంటనే గుఱియైనచో నశించును. * పరమత సహనము అనుపేర ననేకులు ఉబుసుపోక, కేవలవినోదమునకై

* ఇయ్యది శ్రీరామకృష్ణపరమహంసోపదేశరత్నములలో నొకటి.

పరమతాదర్శములవెంట పరుగులిడుచుందురు. ‘ శ్రోత్ర వింత, పాత రోత ’ యనునట్లు శ్రోత్రసంగతులను వినుటనిన వారి కొకవిధమైన తహతహ, అది వారిలో ఒకవిధమైన జాడ్యము, మత సంబంధపు మద్యపానవ్యామోహము. కేవల తాత్కాలికో ద్రేకము నొందుటకై వారు నూతనవిషయములను వినగోరుదురు. ఆయావేదన కాసంత శాంతించినంతనే, ఆపొంగు కొంత చల్లారి నంతనే మఱల శ్రోత్రవిషయములను వినుటకు సంసిద్ధులు. అందులకై ఎక్కడలేని ఆందోళనము, ఆర్తి, ఆవేదన! కేవల కుతూహలమును దీర్చుకొనుటకై, తత్త్వజ్ఞానము వీరికి ఒకవిధమైన ‘ నల్లమందుఅలవాటు’వంటిది, వీరిపారమార్థిక చింతకు పరమా వధి. మఱియొకవిధమైన మానవులు కలరని శ్రీరామకృష్ణ భగవానుడు ఇట్లు వచించువాడు : “వీరు ముత్తెపుజిప్పలవంటి వారు. స్వాతీనక్షత్రము ఉచ్చస్థితియందు ఉన్నప్పుడు ముత్తెపు జిప్ప సముద్రపుటడుగుభాగమునుండి బయలుదేఱి స్వాతీవర్షపు జినుకును సంగ్రహించుటకై ఉపరిభాగమునకు వచ్చును. అది తనచిప్పలను విరివిగా దెఱచుకొని, చినుకొకటి లభించువఱకు నీటిపై దేలియాడుచుండును. తనచిప్పలో వర్ష బిందువు పడి నంతనే సముద్రపుటడుగునకు, తననివాసమునకు, బోవును. అవుడు ఆవర్షబిందువునుండి ఆనిముత్యమును నిర్మింపగల్గువఱకు స్తిమితముగా అచటనే యుండును.

ఇయ్యది ఇష్టనిష్ఠ యను సిద్ధాంతమును కావ్యచాతురితో బ్రకటించు విధానము అనుట నిజము. ఆదర్శమునం దిట్టినిష్ఠ ప్రారంభమున సాధకునకు అత్యావశ్యకమైయున్నది.” శ్రీనాథు డును జానకీనాథుడును ఒకే పరమాత్మయొక్క అవతారము

లయ్యు కమలలోచనుడు అగు రాముడే నా సర్వస్వము'' * అని శ్రీమద్రామాయణమున హనుమంతుడు వచించిన చందమున, లేదా, ''అన్నిటిలో నున్న మాధుర్యమును గైకొనుము, అందరితో గూర్చుండుము, సమస్తనామములను గ్రహింపుము, 'ఔను' అని పల్కుము, కాని నీ యాసనమున (అనగా నిష్ఠయందు) సుస్థిరువుకమ్ము'' † అని తులసీదాసు వచించిన రీతిని భక్తుడు భావింపవలయును. మనఃపూర్వకముగా భక్తిసాధకుడిట్లు భావించినచో ఆతని భక్తిబీజమునుండి పరభక్తియను దివ్యవృక్షము బయల్వెడలి సమస్త ధర్మవ్యాప్తమగుపర్యంతము శాఖోపశాఖలను వ్రేళ్లను దశదిశల వ్యాపింపజేయుచు బ్రహ్మానందఫలదాయకమై విలసిల్లును. ఏ పరాత్పరుడు తన యిష్టదైవమో, సర్వమత సంప్రదాయములచేతను, సమస్తనామరూపములచేతను, సర్వాదర్శములందును ఉపాస్యుడగువాడు ఆ పరాత్పరుడే యని నిజమైనభక్తుడు గ్రహించును.

---

* శ్లో. ''శ్రీనాథే జానకీనాథే అభేదః పరమాత్మని,
తథాఽపి మమసర్వస్వం రామః కమలలోచనః.'' ఇట్లే,

తే. ''జగదధీశ్వరుఁడగు మహేశ్వరునియందు,
సకల జగదంతరాత్ముఁడౌ శార్ఙ్గియందు,
భేదవిజ్ఞానమెయ్యెడ లేదు మాకు
నైనఁ దరుణేందుశేఖరునంద భక్తి''

అని భర్తృహరికవీంద్రుడు నుడివియున్నాడు.

† ''సబసే బసియే సబసే రసియే సబకా లీజియే నామ,
హాజీ హాజీ కరతే రహియే బైఠియే అపనా ఠామ.''—తులసీదాసకృతి.

## పదియవ అధ్యాయము

## సా ధ న క్ర మ ము

భక్తిసాధన క్రమమునుగూర్చి బ్రహ్మసూత్ర రామానుజ భాష్యమున నిట్లు కానవచ్చును : "తల్లబ్ధిర్వివేక విమోకాభ్యాస క్రియాకల్యాణాఽనవసాదానుద్ధర్షేభ్యః సంభవాన్నిర్వచనాచ్చ —అయ్యది వివేకము, ఇంద్రియనిగ్రహము, అభ్యాసము, (యజ్ఞ రూపక) కర్మాచరణము, నిష్కాపట్యము, బలము, అమిత సంతోషము నొందకుండుట యనువాని మూలమున లభించును." మఱియు, "జాత్యాశ్రయనిమిత్తా దుష్టాదన్నాత్, కాయశుద్ధిర్వివేకః—స్వయముగా జాతిచేతను, ఆశ్రయముచేతను, నిమిత్తముచేతను ఏర్పడు అపరిశుద్ధాహారమును శుద్ధాహారమునుండి వేఱుగా గ్రహించుటయే వివేకము" అని శ్రీ రామానుజాచార్యు నభిప్రాయము. శ్రీరామానుజుననుసరించి, (1) స్వయముగా వెల్లుల్లి మొదలగుపదార్థములయందలి జాతిదోషముచేతను (2) అవినీతిపరులనుండి పొందబడుటచేతను, (3) ధూళి, వెండ్రుకలు మొదలైనవానిచేగలుగు భౌతికమాలిన్యము చేతనుమూడు విధములుగా ఆహారము అపరిశుద్ధమగుచున్నది. * "ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః—ఆహారము శుద్ధము ఐనచో సత్త్వము శుద్ధము అగును, సత్త్వశుద్ధిచే స్మృతి సుస్థిరముఅగును"—అని శ్రుతులు చెప్పుచున్నవి. ఛాందోగ్యోపనిషత్తు నుండి శ్రీ రామానుజాచార్యుడు పైవాక్యము నుదాహరించును.

---

* ఇయ్యది రామానుజభాష్యములోనిదని వాక్యకారులచే జెప్పబడినది. ఈవాక్యకారు లెవ్వరో ఇంతవఱకు నిర్ధారణకాలేదు.

ఆహారవిషయమును భక్తులు ఎల్లప్పుడు ప్రధానవిషయముగా పరిగణించి యున్నారు. కొన్ని భక్తిసంప్రదాయములు ఇవ్విషయమై అవలంబించు ఛాందసము—పిచ్చిధోరణి—యట్టుండ ఆహారసమస్యలో గొప్ప సత్యము ఇమిడియున్నది. సాంఖ్య తత్త్వము ననుసరించి, ఏకమగు సామ్యావస్థలో * ప్రకృతిని భిన్నమగు ప్రచలితావస్థలో ప్రపంచమును నిర్మించునట్టి సత్త్వరజస్తమస్సులు అనునవి ప్రకృతిగుణములు అనియు, ప్రకృతిమూల పదార్థములు అనియు మనము జ్ఞప్తిలో నుంచుకొనవలయును. † కావున ప్రతివ్యక్తియు ప్రతిరూపమును ఈ మూలపదార్థముల నుండియే నిర్మాణము అగుచున్నవి; మఱియు సత్త్వాధిక్యము ఆత్మవికాసమునకు అత్యావశ్యకమైయున్నది. ఆహారమూలమున శరీరకోశములలోనికి మనము గ్రహించు పదార్థములే మన మనఃస్థితిని జాలవఱకు నిర్మించుచుండుటచే ఆహారవిషయమున మనము ఎంతయు జాగరూకులమై యుండుట ఒప్పు. ఐనను ఇతర విషయము లందువలెనే ఇవ్విషయమునను శిష్యులు జూపు మూర్ఖాభినివేశమును గురువర్యులకు అంటగట్టుట తగదు.

ఏమైనను ఆహారవిచక్షణనే అన్నిటికంటెను ప్రధానము అని భావింపదగదు. సాధారణముగా 'అన్నము' అని యనువదింపబడు ఈ యాహారశబ్దమునకు పూర్తిగా వేఱువిధమున అర్థముచెప్పుచు పై నుదహరింపబడిన ఘట్టమునకు శ్రీ శంకరాచార్యుడు తన యుపనిషద్భాష్యమున (వేఱువిధమున) వ్యాఖ్యా

* సామ్యావస్థ నొందిన ప్రకృతియే ప్రధానము అని సాంఖ్యులు అందురు.

† సత్త్వరజస్తమోగుణములయొక్క సామ్యావస్థయే ప్రకృతి. సత్త్వాదులను నిర్దేశించు 'గుణము' అనునది పారిభాషికపదము.

నము ఒనరించి యున్నాడు. శంకరాచార్యుననుసరించి, * "ఏది లోనికి గ్రహింపబడునో అదియే ఆహారము. శబ్దాదివిషయ విజ్ఞానము భోక్త (యగునాత్మ) యొక్క భోగము కొఱకై గ్రహింపబడుచున్నది; విషయానుభవములను గ్రహించుటయే లక్షణముగాగల జ్ఞానమును శుద్ధము ఒనర్చుటయే ఆహారశుద్ధి. అనగా రాగద్వేషమోహములచే కలుషితములుకాని విషయవిజ్ఞానమును గ్రహించుటయని యర్థము. కావున నట్టివిజ్ఞానము లేక ఆహారము శుద్ధము ఒనర్పబడుటచే అంతఃకరణము నందలి సత్త్వము శుద్ధము అగుచున్నది; సత్త్వశుద్ధిచే అవిచ్ఛిన్నమగు స్వస్వరూప పరమాత్మస్మరణము లభించును."

శంకరరామానుజవ్యాఖ్యానములు రెండును పరస్పరవిరుద్ధములుగా నున్నట్లు కాన్పించుచున్నను రెండును యథార్థమే, ఆవశ్యకమే. మాంసాస్థిపంజరమగు స్థూలశరీరమును నిగ్రహించుటకంటె సూక్ష్మశరీరమనదగు మనస్సును నిగ్రహించుటయు వశమొనర్చుకొనుటయు నిశ్చయముగా ఘనతర కార్యములు. కాని స్థూలశరీరనిగ్రహము సూక్ష్మశరీర నిగ్రహమునకు అత్యంతావశ్యకమని గుర్తింపవలయును. పూజ్యులును విశ్వసనీయులునగు తన పూర్వాచార్యులనుండి పరంపరానుగతమగు ఆహార నియమములన్నిటిని సాధకుడు శ్రద్ధతో పాటింపవలయును; కాని, ఉన్నత మతతత్త్వములను మంటగలిపి, భోజననియమములందే

* "ఆహ్రియత ఇత్యాహారః, శబ్దాదివిషయవిజ్ఞానమ్ భోక్తుర్భోగాయాహ్రియతే తస్య విషయోపలబ్ధిలక్షణస్య విజ్ఞానస్య శుద్ధిరాహారశుద్ధిః, రాగద్వేషమోహదోషైరసంస్పృష్టమ్ విషయవిజ్ఞానమిత్యర్థః । తస్యామాహారశుద్ధౌ సత్యాం తద్వతోఽన్తఃకరణస్య సత్త్వస్య శుద్ధిర్నైర్మల్యం భవతి । సత్త్వశుద్ధౌ చ సత్యాం యథావగతే భూమాత్మని ధ్రువావిచ్ఛిన్నా స్మృతిరవిస్మరణం భవతి॥" —ఛాందోగ్య శంకరభాష్యము (7-26-2).

మతధర్మము లిమిడియున్నవను శుద్ధఛాందసభూయిష్ఠమగు నర్థరహితస్వమతాభిమానము కేవలము విచిత్రమైన యొకవిధమగు చార్వాకమతము, నాస్తికమతము కాని మఱియొకటికాదు, కాని మన సంప్రదాయములలో అనేకమైన వానికి ఈ గతియే పట్టినది. ఇది జ్ఞానముకాను, భక్తికాదు, కర్మమునుకాదు; ఇది ప్రత్యేకమైన యొకవిధమగునున్మాదము. ఈ యున్మాదమునే పరమార్థముగా భావించువారు బ్రహ్మలోకమునకుకంటె ప్రాయికముగా పిచ్చియాసుపత్రులకు పోవుచుందురు. కావున ఉత్తమ మానసికస్థితియగు సత్త్వమును బొందుటకై ఆహారవివేచనము ఆవశ్యకమనుట ఎంతయు సమంజసము. వేఱువిధమున సాత్త్వికస్థితిని బొందుట దుర్లభము.

తరువాత మనము ప్రయత్నపూర్వకముగా అలవఱచుకొనవలసినది ఇంద్రియనిగ్రహము. ఇంద్రియనిగ్రహము అనగా కామక్రోధాదులకు వశముగాకుండుట. * ఇంద్రియములను విషయములవైపు పోనీయక, నిగ్రహించి, స్వవశమొనర్చుకొనుటయే పారమార్థికసాధనయందలి ప్రధానాశయము. తరువాత గమనింపదగినవి మనోనిగ్రహస్వార్థరాహిత్యములు. నిష్కామగు ప్రయత్నములేనిదే, తీవ్రసాధన చేయనిదే మనయందు అనంతముగాగల సాక్షాత్కారసదవకాశములు సఫలము కానేరవు. "సదా తద్భావభావితః †—సదా భగవంతునిగూర్చియే చింతించుచుండవలయును." ప్రారంభమున మనస్సును సదా భగవంతుని గూర్చియే చింతింప నియమించుట కష్టతరమనుట నిజము, కాని

* "విమోకః కామానభిష్వంగః."

—బ్రహ్మసూత్ర రామానుజభాష్యగత వాక్యకారుడు.

† భగవద్గీత (8-6).

ప్రతిమాతన ప్రయత్నముతోడను అటులోనరించుచో భక్తి మనలో వృద్ధియగును. "అభ్యాసేనతు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే‡— ఓ కౌంతేయా! అభ్యాసముచేతను వైరాగ్యముచేతను మనోనిగ్రహము లభించునుసుమీ!" యని శ్రీకృష్ణుడు గీతలలో దెల్పియున్నాడు. ఇక యజ్ఞ కర్మవిషయమై పంచమహాయజ్ఞములను యథారీతిని ఆచరింపవలయునని గ్రాహ్యము. *

విశుద్ధతయే భక్తికి మూలాధారము, భక్తిసౌధమునకు ఇదియేపునాది. బాహ్యశౌచము, ఆహారవిచక్షణ—యను నీ రెండును సులభసాధ్యములయ్యును అంతశ్శౌచములేనిచో కేవల బాహ్యాచారము నిష్ప్రయోజనము. రామానుజాచార్యు ననుస రించి సత్యము, ఆర్జవము (అనగా నిష్కాపట్యము), దయ, (మనోవాక్కర్మములందు) అహింస, అనభిధ్య † (అనగా పర

---

‡ భగవద్గీత (6-35). "అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః" అని పతంజలిమహర్షియు యోగసూత్రములం దిటులే తెలిపియున్నాడు. మఱియు, "ఆరంభణసంశీలనమ్ పునఃపునరభ్యాసః" అని బ్రహ్మసూత్ర రామానుజ భాష్యగత వాక్యకారుడు.

* "పఞ్చమహాయజ్ఞాద్యనుష్ఠానం శక్తితః క్రియా—పంచమహాయజ్ఞములను శక్తికొలదియు ఆచరింపవలయును" అని బ్రహ్మసూత్ర రామానుజ భాష్యగత వాక్యకారుడు. పంచమహాయజ్ఞములేవన, (1) పితృయజ్ఞము — పితృదేవతలకు శ్రాద్ధతర్పణాదులనొనర్చుట, (2) దేవయజ్ఞము — దేవతలను యజ్ఞములచే పూజించుట, (3) బ్రహ్మయజ్ఞము — వేదశాస్త్రములను జదువుట, (4) భూతయజ్ఞము — పశుపక్ష్యాదులకు బలినొసగుట, (5) మనుష్యయజ్ఞము — అతిథిసత్కారము. ఉద్బోధన సంస్కరణమున ఈఘట్టమునకు సంబంధించిన మఱికొన్ని వాక్యములు కలవు: కామ్యకర్మములను విడువవలయునని వాని తాత్పర్యము.

† ఆంగ్లసంస్కరణమున 'అభిధ్య' అను శబ్దము లేఖకుని ప్రమాద సంజనితము. ఇయ్యది 'అనభిధ్య' యని యుండవలయును.

ధనాదులను ఆశింపకుండుట, వ్యర్థమగు నాలోచనలు చేయకుండుట, పరులవలన దనకు గలిగిన హానిం దలపోసి విషణ్ణచిత్తుడుగాకుండుట) యనునవి విశుద్ధతకు అనుకూలించుగుణములు. ‡ అహింసయనునది ఈగుణగణమున ముఖ్యముగా గమనింపవలసిన సుగుణము. సమస్త ప్రాణులయందును అహింస మనకు విధ్యుక్తధర్మము ; కొందఱు చేయురీతిని మానవులను హింసింపకుండియు, జంతువులను పరమక్రూరముగా హింసించుటయనిగాని, మఱికొందఱివలె చీమలకు పంచదార పెట్టుచు, మఱియు కుక్కలను పిల్లులను సంరక్షించుచు, తోడిమానవులను మాత్రము స్వేచ్ఛగా, నిరాటంకముగా, సర్వవిధములను హింస చేయుటయని కాని అహింసాతాత్పర్యము కానేరదు. ("అతి సర్వత్ర వర్జయేత్" అను సత్యమును పాటింపక) ఈలోకమున ఏసద్భావమునైనను ఏవజనించు పర్యంతము అవలంబించుటకు అవకాశముకలదనునది గమనింపదగినవిషయము. ఏసదాచారమునైనను శాస్త్రమును మక్కికి మక్కిగా గ్రహించి, అతిగా అవలంబించినయెడల తుదకు దానివలన నిజముగా మనకు ఎగ్గువాటిల్లును. తమశరీరమునందలి పేలును క్రిములును చనిపోవునేమోయను భయముచే స్నానమే చేయని కొన్ని సంప్రదాయములలోని మలపుసన్న్యాసులు తమ సోదరమానవులకు ఎట్టిబాధను, రోగములను గల్గించుచున్నారో ఆలోచింపరు, పాపము! ఏమైనను వారు వైదిక సంప్రదాయములోని వారు మాత్రము కారు.

---

‡ మూలమునందలి 'దానము' అనుమాట యెట్లో విడిచిపెట్టబడినది. మూల మిది : "సత్యార్జవదయాదానాహింసానభిధ్యాః కల్యాణాని."
—బ్రహ్మసూత్రరామానుజభాష్యగతవాక్యకారుని వచనము.

అసూయారాహిత్యమే అహింసకు నిదర్శనము. తాత్కాలికావేశముననో, మూఢవిశ్వాసమువలననో, మఱి యేపురోహిత నిర్బంధముచేతనో ఎవ్వడైనను ఒక సత్కార్యమునుగాని మంచి దానముగాని చేసిన చేయవచ్చును. కాని నిజముగా ఎవ్వరియందును అసూయ లేనివాడు ఎవ్వడో వాడే మానవకోటిని ప్రేమించువాడు. అల్పమగు పేరుప్రతిష్ఠలకో, నాలుగుకాసులకో ఒకరియందొకరు అసూయాద్వేషపూరితులగుట మనమందఱము చూచుచున్న విషయమే. హృదయమున ఈ యసూయా పిశాచము ఉన్నంతవఱకు పూర్ణమగు అహింసకు అందు తావు లేదు. గోవులును గొఱ్ఱెలును మాంసము తినవు; కాని యంత మాత్రముచే అవి మహాయోగినులా? అహింసికులా? ఈవస్తువును ఆవస్తువును దినకుండనే మూర్ఖుడైన నుండవచ్చును; కాని దానివలన వానికి శాకాహారులగు జంతువులకంటె అధిక్యము లేశమును లేదు. గతిలేని బాలబాలికలను, వితంతువులను నిర్దాక్షిణ్యముగా వంచించుచు, డబ్బుకొఱకు ఎట్టి నీచకార్యములనైన చేయువాడు, కేవలము గడ్డి తిని జీవించుగాక, పశువుకంటెను వాడు అధముడు. ఎవ్వని హృదయమున ఏ జీవజంతువునకును హానిచేయవలయునను తలపు గలుగదో, ఎవ్వడు తన మహాశత్రువుయొక్క శ్రేయమునైనను జూచి యానందించునో, ప్రతిదినము అతడు పందిమాంసముతిని జీవించుగాక, అతడే నిజముగా భక్తుడు, అతడే యోగి, అతడే జగద్గురుడు. అంతఃకరణశుద్ధికి దోడ్పడుటయే బాహ్యాచారముల విలువయనియు, ప్రయోజనము అనియు సదా మనము జ్ఞప్తిలో నుంచుకొనవలయును. బాహ్యాశౌచమును అంతగా పాటించుట మనకు సాధ్యముకానియెడల, అంతశ్శౌచమును మాత్రమేలక్ష్యించుట శ్రేయస్కరము. నిక్కము,

ఆనంతరమునగు పారమార్థిక ప్రధానతత్త్వములను మఱచి, బాహ్యాచారముల నన్నిటిని భల్లూకమురీతి నంటిపట్టుకొని అవియే పరమార్థము అని భావించువ్యక్తుల—జాతుల—పాపము శాంతించుగాక! అంతర్గతమగు చైతన్యమును వ్యక్తీకరించుటయే రూపములకుగల ప్రయోజనము. ఎపుడు ఈచైతన్యమును ప్రకటించుట మానునో అపుడు అట్టి రూపములను నిర్దాక్షిణ్యముగా నెట్టివేయుడు.

భక్తిసముపార్జనమున తరువాతిసాధన అనవసాదము.* "నాయమాత్మా బలహీనేన లభ్యః."† ఈయాత్మ బలహీనులకు లభ్యముకాదు అని శ్రుతి వక్కాణించుచున్నది. బలహీనులనగా శారీర మానసికబలహీనులని యిచట తాత్పర్యము. "యువాస్యాత్సాధు యువాధ్యాయకః, ఆశిష్ఠో దృఢిష్ఠో బలిష్ఠః"‡ యువకులు, సత్త్వగుణోపేతులు, కార్యదక్షులు, దృఢగాత్రులు, బలవంతులు—ఇట్టివారే ఆత్మవిద్యను అవలంబింపదగినవారు. ముదిమిచే బలము ఉడిగిన దుర్బలులు, అల్పులు ఏమిచేయగలరు! అత్యద్భుతము, అగోచరమునగు మనశ్శరీరశక్తులు ఏ యోగాను ష్ఠానముచేగాని రవంత ప్రబుద్ధమైనంతనే వారు ముక్కముక్కలై పోవుదురు. కార్యదక్షులు, దృఢగాత్రులు, బలోపేతులు నగు వారినే విజయలక్ష్మి వరించును. కావున శరీరబలము అత్యంతావశ్యకము. దృఢశరీరముమాత్రమే ఇంద్రియనిగ్రహమును చే

* "దేశకాలవైగుణ్యాచ్ఛోకవస్త్వాద్యనుస్మృతేశ్చ, తజ్జదైన్యమభాస్వరత్వం మనసోఽవసాదః, తద్విపర్యయోఽనవసాదః."

—బ్రహ్మసూత్ర రామానుజభాష్యగత వాక్యకారుడు.

† ముండక. (3-2-4).

‡ తైత్తిరీయ. (2-8).

గలుగు శాకుడును భరింపగల్గను. భక్తుడు కాగోరువాడు బల వంతుడుగా, ఆరోగ్యవంతుడుగా నుండవలయును. వట్టి దుర్బ లులు ఏ యోగమును అవలంబింప యత్నించినను, ఇక కుదురని యే వ్యాధియో, ఏ మనోదౌర్బల్యమో సంభవించును. ప్రయత్న పూర్వకముగా శరీరమును బలహీనముచేసికొనుట ఆత్మవికాస మునకు మార్గము కానేరదు.

మానసికదుర్బలులును ఆత్మలాభము నొందజాలరు. భక్తుడు కాగోరువాడు ఉత్సాహపూరితుడై యుండవలయును. పారమార్థిక చింతాసక్తినిగూర్చి పాశ్చాత్యులకు గల యభిప్రాయ మేమనగా, అతడెన్నడును నవ్వరాదు; దానికితోడు చప్పిదౌడ లతో, దేవిరింపుచూపులతో మొగము ముడుచుకొని యొకచోట గూర్చుండవలయును: ఇదియే పారమార్థికుల లక్షణము: భేష్! భేషు! కృశించిన శరీరముతో, దేవిరింపుమొగముతో కూలబడు వారు వైద్యుని చికిత్సకు అర్హులు గాని, యోగమునకు అర్హులు కారు. ఉత్సాహపూరితమగు మనస్సే నిలుకడకు పుట్టినిల్లు. బలీయమగుమానసమే కంటకభూయిష్ఠమగుమార్గమును నడచు కొని భగవదున్ముఖము కాగలదు. మాయాజాలమును ఛేదించి, భగవదాయత్తచిత్తులనుజేయు ఈ కఠినప్రయత్నము, ఈ మహా కార్యము, నిరుపమానసంకల్పబలాన్వితులకు మాత్రమే నియ మితమైయున్నది.

ఐనను మితిమీరిన సంతోషముతో పొంగిపోరాదు. * మితిమీరిన సంతోషము తీవ్రాలోచనకు మనలను అసమర్థులను జేయును; మనశ్శక్తులను దుర్వినియోగమొనర్చును. సంకల్ప

* "తద్విపర్యయజా తుష్టిరుద్ధర్షః."
—బ్రహ్మసూత్ర రామానుజభాష్యగత వాక్యకారుడు.

శక్తి బలీయముగా నున్నకొలదియు, కామక్రోధాదులకు వశులముగాకుందుము. విచారకమగు తీవ్రచింతనము ఎంత నిరాదరణీయమో అతిసంతోషమును అంత నిరాదరణీయము; మఱియు సమతచే దీపించు ప్రశాంతస్థితిలో మనస్సు నిలుకడ గలిగియున్నప్పుడే సమస్తతత్త్వానుభూతియు సుసాధ్యమగును.

ఇట్లు భగవానుని ప్రేమించు విధానమును నేర్వనగును.

---

# పరభక్తి

## పదునొకండవ అధ్యాయము

## సాధకుని వైరాగ్యము

వైధభక్తివిచారమును ముగించిన మన మిపుడు పరభక్తి తత్త్వమును గ్రహింప యత్నింతము. పరభక్తిని బడయుటకు గల సాధనను గూర్చి చెప్పవలసియున్నది. చిత్తశుద్ధియే యిట్టి సాధనలన్నిటికిని ప్రయోజనము. నామజపము, కర్మకలాపములు, ప్రతీకోపాసన, శాస్త్రవిధులు మొదలగునవన్నియు చిత్తశుద్ధికే వినియోగించుచున్నవి. వీని యన్నిటిలో నుత్తమమైనది—ఏది లేనిచో పరభక్తిసౌధము నెవ్వడును ప్రవేశింపజాలడో అదియే—వైరాగ్యము. వైరాగ్యమనినంతనే అనేకులకు భీతి కలుగును! కాని వైరాగ్యములేనిదే ఎట్టి యాత్మవికాసమును గలుగనేరదు. సమస్త యోగములకును వైరాగ్యము ఆవశ్యకము. పరభక్తి సౌధమునకు ఇదియే ప్రథమసోపానము, తత్త్వజ్ఞానమునకు బీజము, యోగమునకు మూలమంత్రము; వేయేల, వైరాగ్యమే పరవిద్యకు ప్రాణము. వైరాగ్యమే (లోక-త్యాగమే) పరమార్థము,

పరవిద్య. జీవుడు ప్రాపంచికవిషయ విముఖుడై పరతత్త్వము నెవుడు గ్రహింప యత్నించునో, అనృతజడదుఃఖాత్మకమగు లోకమున నెట్లో బద్ధమైన జీవాత్మ తన దుఃస్థితిని గ్రహించి ప్రకృతి కెవుడు విముఖమగునో, అవుడే నిజమగు నాత్మవికాసము గలుగనారంభించును. * కర్మయోగివైరాగ్యము సమస్తకర్మఫల త్యాగరూపమై యున్నది; కర్మఫలములం దాతడు ఆసక్తుడు కాడు; ఇహాపరములయం దాతని కెట్టి ఫలభోగవాంఛయు లేదు; వాని నాతడు లక్ష్యింపడు. సమస్తప్రకృతియు పురుషానుభవమునకై ఉద్దిష్టమైయున్నదనియు, ప్రకృతిపురుషులు భిన్నతత్త్వములని గ్రహించుటయే సమస్తానుభవఫలితమనియు రాజయోగి తెలిసికొనును. జీవాత్మ తనకు ప్రకృతితో నుండు సంబంధము కేవల తాత్కాలికమనియు, శాశ్వతముగా తాను ఆత్మననియు, ప్రకృతిని గాననియు స్వానుభవపూర్వకముగా గ్రహింపవలసియున్నది. స్వీయమగు ప్రకృతిగుణానుభవమువలననే రాజయోగి త్యాగతత్త్వము నెఱుంగును. జ్ఞానయోగివైరాగ్యము కఠినాతికఠినము; ఏలన, సుస్థిరమై తోచు నీప్రకృతియంతయు వట్టి మాయయని † యాతడు ఆదినుండియు గ్రహింపవలసియున్నది. ప్రకృతియందే శక్తులు ద్యోతకమగుచున్నను అవి యన్నియు ఆత్మవికాని ప్రకృతివికావని తెలిసికొనుటయే ఆతనికర్తవ్యము. సమస్తజ్ఞానము

---

* "పరాఞ్చిఖాని వ్యతృణ త్స్వయంభూః తస్మా త్పరా క్పశ్యతి నాంతరాత్మన్। కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షదావృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్." —కఠ. (2-1-1).

† ఇందలి మాయయనుమాటకు అక్షరార్థము చేయరాదు. ఏలన, నామరూపప్రపంచమంతయు వ్యావహారికదృష్టితో జూచిన మాయికము, పారమార్థికదృష్టితో జూచిన సత్యము.

నకును సమస్తానుభవమునకును నిలయము ఆత్మయేకాని ప్రకృతి కాదని యాతడు ఆదినుండియు గ్రహింపవలయును, కావున నాతడు కేవలవివేకబలమ్ముచే మాయాబంధమును త్రోసిరాజన వలయును. ఇట్లు ప్రకృతిని, ప్రకృతిసర్వస్వమును విడిచిపుచ్చి వానిని త్రోసిరాజనైనను జూడక జ్ఞానయోగి అద్వితీయుడై నిలువ యత్నించును !

వైరాగ్యము అంతటియందును భక్తియోగి వైరాగ్యమే అత్యంత స్వాభావికమైనదని చెప్పనొప్పును. ఇందేమియు బలాత్కారములేదు, త్రోసిరాజనవలసినది లేదు, ప్రబలయత్నముచే తొలగించుకొనవలసినది లేదు. భక్తునివైరాగ్యము సులభమై, సరళమై, సహజమై, నిరాటంకమై ప్రవహించును. మనచుట్టు నున్న విషయము లెంత స్వాభావికములో భక్తుని వైరాగ్యమంత స్వాభావికము. కొంచెము వికృతరూపమున నయ్యును ఈ విధమగు వైరాగ్యము లేక త్యాగము అనుదినము లోకమున మనకు గోచరించుచునే యున్నది. ఒక డొక స్త్రీని ప్రేమింప నారంభించును; కొంతకాలమైనవెనుక మఱియొకతెను ప్రేమించును, తోడనే మొదటియామెను విడిచిపెట్టును. లేశమైనను ఆమె లేదను చింతలేకయే ఆతని మానసమునుండి యామె చల్లగా, నిమ్మళముగా, నిశ్శబ్దముగా తొలగిపోవును. ఒకస్త్రీ యొకనిని ప్రేమించును; ఇంతలో మఱియొకనిని ప్రేమింప నారంభించును; తోడనే మొదటివా డామెహృదయమునుండి స్వాభావికముగనే తొలగిపోవును. ఒకడు తనపట్టణమును ప్రేమించును. అంతట తన దేశమును ప్రేమింప మొదలిడును; అపుడు తన పట్టణముపై నాతని కుండిన యగాధప్రేమ స్వాభావికముగనే తొలగిపోవును. మఱియు నొకడు లోకమునంతను ప్రేమింపనేర్చును, అపుడాతని

దేశభక్తి—పరదేశము పేరు సహింపని యాతని తీవ్రదేశాభి మానము—అతని కేమియు బాధకల్గింపకుండ, బలాత్కారమను నది లేకుండ, చల్లగా సమసిపోవును. అప్రాజ్ఞుడు విషయసుఖ ములను అత్యంతముగా ప్రేమించును; ప్రాజ్ఞుడైన కొలదియు విద్యావిషయ కానందమున రమించును; అప్పు డాతని విషయ సుఖములు క్రమముగా నొత్తిగిలును. తోక యూడించుచు, లొట్టలు వేయుచు స్వర్గసుఖ మనుభవించుచున్నట్లు తిను కుక్క వలెను, తోడేలువలెను, ఏ మానవుడును ఆహారమును దిని యానందింపజాలడు; కాని ధీవైభవముచే, ప్రతిభాతిశయముచే, మానవుడు పొందు నానందమును కుక్క లెన్నటికిని పొందజాలవు. ప్రారంభమున సుఖమనునది కామ సంతృప్తితోడను ఉదరతృప్తి తోడను గూడుకొనియుండును; కాని, జంతువు ఉన్నతస్థితిని బొందిన కొలదియు నీచసుఖములందలి తీవ్రకాంక్ష క్షీణించుచుం డును. జంతుస్వభావమునకు సన్నిహితుడై యున్నకొలదియు మానవునకు విషయసుఖములందు అధికానందము గాన్పించుట సహజము. ప్రాజ్ఞుడు విద్యావంతుడైనకొలదియు, వైజ్ఞానిక విషయములందును కళలందును ఆతనియానంద మినుమడించు చుండును. కావున మానవుడు ఎపుడు ధీశక్తిని సైతము అతిక్ర మించునో, కేవల వైజ్ఞానికస్థితిని దాటి, తత్త్వానుభవ తేజమును, ఆత్మానందజ్యోతిని దర్శించునో అపుడు తన యానందము నిరుప మానమని గ్రహించును; విషయ సుఖములుగాని, వైజ్ఞానికానం దముగాని అట్టి బ్రహ్మానందముతో అణుమాత్రమును బోల్పదగ వని యెఱుంగును. * చంద్రుడు దేదీప్యమానముగా వెల్గొందు

---

* శ్లో॥ "యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్
తృష్ణాక్షయసుఖస్యైతే నార్హతష్షోడశీంకలామ్॥"

నపుడు తారకలన్నియు నిస్తేజములగును; సూర్యుడు ప్రకాశించు నపుడో, చంద్రుడు వెలవెలబోవును. భక్తిని బడయుటకు వలయు వైరాగ్యమునకు దేనిని పరిమార్పనక్కఱలేదు. కాని, జాజ్వల్యమానమగు దివ్యజ్యోతిముందు చిన్నచిన్నదీపము లెట్లు సహజముగా వెలవెలబోవునో, తుదకు కాన్పింపకుండునో, అట్లే భక్తితేజము సహజముగా విషయసుఖముల నణచి వెల్గొందును. ఇట్లు దేదీప్యమానమగు భగవత్ప్రేమముందు, విషయాసక్తియు, ధీవైభవముచే గలుగు నానందము సహితము కాంతిహీనములై కన్పట్టును. ఇట్టి భగవద్భక్తియే పరభక్తియన నొప్పును. పరభక్తినిబడసిన మానవునుండి కర్మకలాపములు పలాయనమగును; శాస్త్రవిధులు అదృశ్యమగును; గ్రంథములు నివర్తించును; ఆలయములు, విగ్రహములు, మతములు, సంప్రదాయములు, దేశములు, జాతులు మున్నగు క్షుద్రనిబంధనలన్నియు తమంత తామే సెలవుగైకొని మఱలును. ఆతని స్వాతంత్ర్యము నేదియు నిరోధింపజాలదు. ఆకస్మికముగా నొకయోడ సూదంటుపర్వతమును సమీపించు ననుకొనుడు. అపుడోడయొక్క మేకులను, ఇనుపతేకులను—అన్నిటిని పర్వతము ఆకర్షించి లాగివేయును. ఓడబల్ల చెక్కలన్నియు అపుడు విడిపోయి స్వేచ్ఛగా నీటిపై దేలియాడును. ఈశ్వరానుగ్రహము ఇట్లే హృదయగ్రంథులను విడగొట్టి ఆత్మవిమోచన మొనర్చును. * కావున భక్తికివలయు నిట్టి వైరాగ్యమున నే కాఠిన్యమును, రసహీనతయు, ప్రయత్నమును, నిగ్రహమును, నిరోధమును లేదు. తన కామాదులలో

---

* ఇయ్యది శ్రీ రామకృష్ణపరమహంసయొక్క ఉపదేశరత్నములలో నొకటి.

చేసినిభక్తుడు నిరోధింపనక్కఱలేదు; వానిని తీవ్రముగా నొనర్చి భగవదున్ముఖ మొనర్చుటయే ఆతనికర్తవ్యము. †



## పండ్రెండవ అధ్యాయము

## భక్తి వైరాగ్యము ప్రేమసంబంధితము

ప్రకృతియం దెచటచూచినను ప్రేమయే—ప్రేమమహత్త్వమే—మనకు గాన్పించుచున్నది. సంఘమునం దెయ్యది సౌభాగ్యమై, ఉత్కృష్టమై, మహనీయమై విరాజిల్లునో అదియంతయు ప్రేమఫలితమే; ఇటులే సంఘమునకు ఏది చెడుగై, రాక్షసకృత్యమై కాన్పించునో అదియు దుష్పథమున బ్రవహించుచున్న ప్రేమవలన గలుగు ఫలితమే. ఈ దివ్యమనోభావమే భార్యాభర్తలకు ఒండొరులయందుగల పవిత్ర ప్రేమను—దివ్యప్రణయమును—మనకు ఒసగుచున్నది. మఱియు నీచవిషయాసక్తి నిలయమగు కామమును ఈ ప్రేమరూపమే. మనోభావము ఒక్కటియే యయ్యు వేఱువిషయములందు వేఱురీతులుగా వ్యక్తమగుచుండును. సన్మార్గముననో, దుర్మార్గముననో వ్యక్తమగు ఈ ప్రేమావేశమే ఒకనిని బీదలకు తన సర్వస్వము త్యాగ మొనర్చి మఱియు సత్కార్యములను చేయ బ్రేరేపించుచున్నది; మఱియొకనిని తనసోదరుల కుత్తుకల నుత్తరించి వారల సర్వస్వమును హరింపజేయుచున్నది. మొదట చెప్పిన వ్యక్తి యితరుల నెంత ప్రేమించునో రెండవవ్యక్తి తన్ను తానంత ప్రేమించుకొనుచున్నాడు. ఒకనిప్రేమ దుర్మార్గమునను మఱియొకని ప్రేమ-

† "తదర్పితాఖిలాచారః సన్ కామక్రోధాభిమానాదికం తస్మిన్నేవ కరణీయమ్."—నారద భక్తిసూత్రము (65).

సన్మార్గమునను వ్యక్తీకరింపబడుచున్నది. ఒకని ప్రేమమార్గము న్యాయ్యము, యోగ్యము నగుచుండ, మఱియొకని దన్యాయ్యము, అయోగ్యము నగుచున్నది. వంటచేసికొనుటకు మనకు దోడ్పడు నిప్పే బిడ్డనిచేతిని కాల్పవచ్చును. అది నిప్పుదోషము కానేరదు; భేదము అంతయు వినియోగించుకొను విధానములో నున్నది. సృష్టిలో మనకు గాన్పించు నన్యోన్య సమాగమమునందలి తీవ్ర వాంఛ, ఏకీభావ మొందవలయునను ప్రబలేచ్ఛ, తుదకు బ్రహ్మైక్య మొందవలయునను దృఢేచ్ఛ సమయానుకూలముగా ఎల్లెడలను నీచోచ్చస్థితులలో వ్యక్తమగుచుండును. భక్తియోగము ఉత్తమప్రేమసరణిని దెలుపు శాస్త్రము. ప్రేమ నెట్లు సక్రమమార్గమున జూపవలయునో భక్తియోగము మనకు బోధించును. ప్రేమను వశమొనర్చుకొను విధానము, వినియోగించుకొనవలయు రీతి, ప్రేమకు నూతనాశయమును గల్పించి దివ్యఫలితమును బడయుమార్గము, అనగా బ్రహ్మానంద ప్రాప్తికి ప్రేమను సాధనమొనర్చుకొను సరణి భక్తియోగము మనకు దెలుపును. "త్యజింపుము" అని యెన్నడును భక్తియోగము శాసింపదు; "ప్రేమింపుము, మహోత్తమమగు దానిని ప్రేమింపుము" అని మాత్రమే యుపదేశించును. మఱియు నెవ్వనికి పురుషోత్తముడగు పరమేశ్వరుడు ప్రేమపాత్రుడై యొప్పునో, అల్పవిషయములన్నియు సహజముగానే అట్టివానినుండి తొలగి పోవును.

"నీవు నా ప్రేమజ్యోతి వనుటకంటె నిన్నుగూర్చి నే నేమియు జెప్పజాలను. ఏమి సుందరమూర్తివోయి! ఆహా! ఏమి సుందరమూర్తివోయి! సౌందర్యమే నీ రూపము!"—భగవానునిగూర్చి భక్తుడు ఇట్లు భావించును. మన సౌందర్యపిపా

నను భగవంతునివైపు మఱల్చుటయే భక్తియోగమున మన కర్తవ్యము. మానవవదనములో, ఆకాశములో, తారకలలో, చంద్రబింబములో ఏమి సౌందర్యమున్నది ? ఒకవేళ నున్నచో, యథార్థము, సమస్తలోకాతీతము, నగు లోకేశ్వర సౌందర్యము వానియందు లవలేశము ప్రతిఫలించుటయే కాని వేఱుకాదు. "త్వమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి—ఆతడు ప్రకాశించుటచేతనే సమస్తము ప్రకాశించుచున్నది. ఆతని ప్రకాశము మూలముననే ఈ సమస్తము భాసించుచున్నది." * భక్తియోగము దెలుపు నీ మహోత్తమ సిద్ధాంతము నవలంబించి, "నే నిట్టివాడ నట్టివాడను" అని తోపించు మీ చిన్నచిన్న వ్యక్తిత్వములను సంపూర్ణముగా మఱచిపొండు. పరమ నీచమగు నహంకార మమకారములను విసర్జింపుడు. సమస్తమగు మీ మనుష్యాశయముల చేతను, ఉన్నతా దర్శములచేతను పొందదగినది మానవత్వమే యనియు, సదా దీని నంటిపట్టుకొని యుండవలయుననియు భావింపకుడు. సాక్షీభూతులై, విద్యార్థులై ఈ ప్రకృతిదృశ్యమును దిలకింపుడు. మానవునెడ, మానవకోటియెడ నిస్సంగబుద్ధి నలవఱచుకొనిన వారలై, ఈ మహాప్రేమభావము ఎన్నెన్నివిధముల లోకమున వ్యక్తమగుచున్నదో గనుడు. ఒక్కొక్క తఱి కొంచెము అలజడి కలుగుచుండును; కాని యథార్థమగు దివ్యప్రేమను బొందుటకై యొనర్చుయత్నముననే ఇది సంభవించును. ఒక్కొక్కప్పుడు ఇంచుక పోరాటమో, పతనమో గలుగును; కాని యివి యన్నియు నైమిత్తికములు, తాత్కాలికములు. సాక్షిమాత్రుడవై యొత్తిగిలి, ఈ యలజడులను, ఒడిదుడుకులను యథేచ్ఛ

* ముండక. (2-2-10) మఱియు కఠ. (2-2-15).

ముగా రానిమ్ము. విశ్వవాహినియం దున్నంతవఱకే నీ శ క్తి యొడిదుడుకులవలన నలజడి కలుగుచుండునుగాని కేవల సాక్షి భూతుడవై, విద్యార్థివై చూచునపుడు అనంతకోటివిధముల, భగవానుడు ప్రేమద్వారమున దన్ను దాను వ్యక్తీకరించుకొను చుండుట గాంచగల్గుదువు.

"కేవల మన్మథవ్యాపారమున గానిండు, లేశమగు నానందముగల తావులందెల్ల నిత్యానందమూర్తియగు పరమేశ్వరుని అంశయే విరాజిల్లుచున్నది." * పరమ నికృష్టమగు కామ్యాకర్షణలోగూడ పరమేశ్వరాంశయే విరాజిల్లుచున్నది. భగవన్నామములందలి 'హరి' యను శబ్దమునకు సమస్తము నాకర్షించు వాడని యర్థము. మానవమనోహరి కాదగువాడు హరి యొక్కడేకదా! నిజముగా జీవాత్మ నెవ్వడు ఆకర్షింపగలడు! నిక్కముగా పరమాత్మయే! జడప్రకృతి యెన్నడైన ఆత్మ నాకర్షింపగలదా? అది క్లిన్నడును ఆకర్షించియుండలేదు, ఆకర్షింప జాలదు. సుందరవదనమును జూచి యొకడు మోహితుడై దాని వెంటబడునపుడు అందలి పిడికెడు భౌతికరేణువులా నిజముగా నాతని నాకర్షించునవి? ఎన్నటికిని కాదు. ఆ రేణువుల వెనుక దివ్యప్రేమలీల—దివ్యప్రభావలీల—ప్రకాశించుచున్నది; ప్రకాశించుచుండవలయును. అజ్ఞుడు దీని నెఱుగడు; ఎఱిగినను ఎఱుగకున్నను వానిచే మాత్రమే ఆకృష్టుడగుచున్నాడు. కావున క్షుద్రమగు కామ్యాకర్షణ గూడ సాక్షాద్భగవానునివలననే శక్తిమంతమగుచున్నది. "న వా అరే పత్యుః కామాయ

---

* "యేతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి."
—బృహదారణ్యక. (4-3-32).

పతిః ప్రియో భవత్యాత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి * —ప్రేయసీ! పతికొఱకే ఎవ్వరును పతిని ప్రేమింపలేదు. ఆత్మకొఱకు, అంతరాత్మకొఱకు పతి ప్రియుడగుచున్నాడు." మనసిచ్చి ప్రేమించు సతు లీసంగతి నెఱింగినను ఎఱుగకున్నను ఇది యథార్థము. "న వా అరే జాయాయై కామాయ జాయా ప్రియా భవత్యాత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి†—ప్రేయసీ! భార్యకొఱకే భార్య నెవ్వరును ప్రేమింపలేదు. కాని అంతరాత్మ కొఱకు భార్య ప్రియురాలగుచున్నది." జగమున సమస్త జగదంతరాత్మ మూలమున గానిచో బిడ్డలనుగాని మఱివేనిని గాని ఎవ్వరును ప్రేమించువారు కారు. పరమేశ్వరుడు మహాయస్కాంతము, మనమందఱము ఇనుప రేణువులము; సదా మనము ఆతనిచే ఆకృష్టుల మగుచున్నాము; ‡ ఆతని ప్రాపించుటకే మన మందఱము ప్రబలయత్నము చేయుచున్నాము. లోకమున నిజముగా మన యీరాయారాటము లన్నియు కేవల స్వార్థపరతకు ఉద్దేశింపబడినవి కావు. అజ్ఞులు తా మేమిచేయుచున్నారో ఎఱుగరు: కాని వారిజీవితోద్దేశము ఈ భగవదయస్కాంతమును సమీపించుటయే. జీవితరంగమున మన మహాసంరంభమంతయు

---

* బృహదారణ్యక. (2-4-5).

† బృహదారణ్యక. (4-3-32).

‡ తే. "ఇను మయస్కాంతసన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీకేశుసన్నిధి నావిధమునఁ
గరఁగుచున్నది దైవయోగమునఁ జేసి
బ్రాహ్మణోత్తము చిత్తంబు భ్రాంతమగుచు."
—ఆంధ్రభాగవతము, ప్రహ్లాదచరిత్ర, సప్తమస్కంధము (149).

—ప్రయత్నమంతయు— తుద కా భగవానునియందు మనలను ఐక్యమొందజేయుటకే ఉద్దిష్టమైయున్నది. *

భక్తియోగి జీవితసంరంభమునందలియర్థము నెఱుగును, దాని నాతడు గ్రహించియున్నాడు. ఈ మహాసంరంభపరంపర నాతడు అనుభవించి యుండుటచే అందలి కల్లోలమునుండి విముక్తుడు కాగోరును; ఈ సంఘర్షణమునుండి తొలగి యాతడు సర్వజన మనోహారియగు వారిని జేర తల్లడిల్లును. ఇదియే భక్తుని వైరాగ్యము. భగవదున్ముఖులను జేయు నీదివ్యానురాగము సమస్తరాగములను అదృశ్యముజేసివైచును. అనంత భక్తిపూరితుడగు నాతని హృదయమున లౌకికప్రేమకు తావులేదు, తావుండుటెట్లు? భగవద్భక్తిసాగరామృత మాతనిహృదయమును నింపివైచినది; ఇక క్షుద్రప్రేమలకు అందు తావులేదు. ఇట్లు అఖండమగు భగవదనురాగముచే భగవదితర విషయముల యెడ భక్తునకు జనించు విముఖతయే అతని వైరాగ్యము.

పరభక్తిని బొందుట కిదియే మహోత్తమోపాయము. ఈ వైరాగ్యము జనించినంతనే హృదయకవాటము విడివడి, ఆత్మ పరభక్తిసామ్రాజ్యమున బ్రవేశించును. పరభక్తియన నేమో అపుడు మనము గ్రహింప నారంభింతుము; పరభక్తిగర్భాలయమున బ్రవేశించినవ్యక్తి మాత్రమే సమస్త శాస్త్రవిధులను ప్రతీకములను సాక్షాత్కారమునకు దనకు అనావశ్యకములని వచింప సమర్థుడు, ఆతడే అందులకు అధికారి. విశ్వమానవసౌభ్రాత్రమును దివ్యప్రేమను ఆతడే బడసియున్నాడు; ఇతరులు వట్టి వాచాలురు. ఆతనికి ఎట్టి భేదములును కానరావు దివ్యప్రేమ సాగరామృతము ఆతని హృదయప్రవేశ మందినది.

* "మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః."—భగవద్గీత (4-11)

మనుష్యు నిక నాతడు మనుష్యునిగా గనడు, కాని ప్రేమపాత్రు డగు భగవానుడే ఎల్లెడలను ఆతనికి గోచరించును; సమస్త వదనములందును తన శ్రీహరియే వెల్గొందుచున్నట్లు లాతనికి గన్పట్టును. సూర్యకాంతి—చంద్రకాంతి—సమస్తము వానికి భగవన్మూర్తియే. ఎచట సౌందర్యమున్నను, ఎచట ఔన్నత్యము గోచరించినను అంతయు నాతనికి ఆ పరమేశ్వర సౌందర్యమే, ఆ పరమేశ్వరౌన్నత్యమే. * అట్టిభక్తు లింకను సజీవులై యున్నారు; లోకమున వారు లేని సమయ మెన్నడును లేదు. అట్టివారిని పాము కఱచినను తమ జగన్మోహనునుండి వార్తావహుడు అరుదెంచెనని పల్కుదురు. † ఇట్టివారే విశ్వమానవ సౌభ్రాత్రమునుగూర్చి మాటాడనధికారులు. వారి కెన్నడును కోపమురాదు. ఈర్ష్యాద్వేషములకు ఎన్నడును వారి హృదయము తావీయదు. బాహ్యప్రపంచము, విషయప్రపంచము వారి మానసమునుండి శాశ్వతముగా అదృశ్యమైపోవును. ఈ దృశ్యప్రపంచమునకు ఆధారభూతమగు సత్యమును నిత్యము వారు గాంచగల్గుచుండ నిక వారికి కోపము ఎట్లువచ్చును?

---

* శ్లో॥ "యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా,
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్."
—భగవద్గీత (10-41).

† తన సమకాలికుడగు పవహారిబాబా యను మహనీయుని చారిత్రము నుగ్గడించుచు వేఱొక సందర్భమున స్వామియే యిట్లు తెల్పియున్నాడు.

# పదుమూడవ అధ్యాయము

## భక్తియోగ స్వాభావికత్వము : అందలి మూలరహస్యము

"సంతతశ్రద్ధతో నిన్నుపాసించు వారలయందును, అక్షరము, అవ్యక్తమునగు పరబ్రహ్మము నుపాసించువారలయందును యోగిశ్రేష్ఠులు ఎవ్వరు ?" అని యర్జునుడు శ్రీకృష్ణుని ప్రశ్నించెను. * అందులకు శ్రీకృష్ణుడు ఇట్లు సమాధానమొసగెను : † "ఎవ్వరు నాయందు మనస్సు నిలిపి, నిత్యసమాహితచిత్తులయి, అత్యుత్తమశ్రద్ధతో నన్నుపాసించుచుందురో—వారే నా యుత్తమోపాసకులు, యోగిశ్రేష్ఠులు. నాశరహితము, అనిర్దేశ్యము,

---

* "ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే,
యేచాఽప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః."
—భగవద్గీత (12-1).

"ప్రశ్ననిరూపణాభ్యా మాధిక్య సిద్ధేః."
—శాండిల్య భక్తిసూత్రము (1-2-28).

† "మయ్యావేశ్య మనో యేమాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః.
యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగమచింత్యం చ కూటస్థ మచలం ధ్రువమ్.
సన్నియ మ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువంతి మా మేవ సర్వభూతహితే రతాః.
క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్,
అవ్యక్తాహి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే.
యే తు సర్వాణి కర్మాణి మయిసన్న్యస్య మత్పరాః,
అనన్యే నైవ యోగేన మాంధ్యాయంత ఉపాసతే.
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి నచిరా త్పార్థ మ య్యావేశితచేతసామ్."
—భగవద్గీత (12 అ. 2-7).

అవ్యక్తము, సర్వవ్యాప్తము, అచింత్యము, అచలము, శాశ్వతము నగు పరబ్రహ్మము నెవ్వరు ఉపాసించుచుందురో, ఉత్తమమగు నింద్రియనిగ్రహ మవలంబించి, అన్నిటియందును సమబుద్ధి గలిగి, సర్వభూతహితమున రమించుచు వారు నన్నే ప్రాపించుచున్నారు. కాని అవ్యక్తమగు బ్రహ్మమునందు ఆసక్తచిత్తులగువారల మార్గము కష్టతరము; ఏలన, దేహాభిమానయుక్తులగువారలకు ఈ పరబ్రహ్మనిష్ఠ ప్రబలాయాసకరము కానిదే సిద్ధింపదు. ఎవ్వరు తమ సమస్తకర్మములను నాకు అర్పించి, అనన్యాసక్తచిత్తులై పరిపూర్ణవిశ్వాసముతో నన్ను ధ్యానించుచుందురో వారలను జననమరణరూపమగు సంసారసాగరమునుండి అతిశీఘ్రముగా నే నుద్ధరింతును.'' ఇచట జ్ఞానయోగభక్తియోగములు రెండును సూచింపబడినవి. రెండును పైని నిర్వచింపబడినవి. జ్ఞానయోగము దివ్యమైనది; మఱియు జ్ఞానయోగము మహోన్నతవేదాంతమయము; ఇక నించుమించుగా ప్రతిమానవుడు—అది యేమి చిత్రమోగాని—వేదాంతవిహితమగు సమస్తము విధిగా తాను చేయగలనని తలంచుచుండును; కాని నిజముగా వేదాంతవిహితజీవనము గడపుట చాలకష్టము. వేదాంతానుసారము జీవితమును గడపయత్నించుచు తఱచు మహాపదలకు గుఱియగుచుందుము. లోకము ఇరుతెఱగుల వ్యక్తులతో గూడుకొనియున్నదని చెప్పవచ్చును—శరీరసంరక్షణమే జీవిత పరమావధిగా నెంచు ఆసురసంపదగలవా రొకతరగతివారు, శరీరము కేవలధర్మసాధనమని ఉత్తమపురుషార్థమును—ఆత్మజ్ఞానమును—బడయుటకు కేవల సాధనభూతమని గ్రహించు దైవసంపదగలవారు వేఱొకతరగతివారు. తన కృత్యములు ధర్మసమ్మతమని తెలుపుటకై పరమదుర్మార్గుడునైతము శాస్త్రప్రమాణములను జూప

వచ్చును, నిజముగా జూపు చుండును *; ఈ రీతినే జ్ఞానమార్గము సజ్జనుని సత్కార్యముల నెంత ప్రోత్సహించునో దుర్జనుని దురభ్యాసములను అంత సమర్థించుచున్నట్లు గాన్పించును. జ్ఞానయోగములోనున్న మహాప్రమాదము ఇది. జ్ఞానయోగివలె భక్తుడు ఒక్కసారిగా అంత పై కెగురనుఎగురడు, అందుచే గుభాలున ఒక్కసారిగా పతనము పొందనుపొందడు. పారమార్థికు డగువాడేమార్గమవలంబించినను, నిజముగా హృదయగ్రంథి వీడనిదే ఎన్నటికిని ముక్తుడు కాడు.

పావనచరిత్రయగు నొకగోపిక యెట్లు పుణ్యపాపబంధవిముక్తయయ్యెనో ఈ క్రింది శ్లోకములు వెల్లడించును :

తచ్చిన్తా విపులాహ్లాదక్షీణపుణ్యచయా తథా,
తదప్రాప్తిమహద్దుఃఖవిలీనా శేషపాతకా.
చిన్తయన్తీ జగత్సూతిం పరబ్రహ్మస్వరూపిణమ్,
నిరుచ్ఛ్వాసతయా ముక్తిం గతాన్యా గోపకన్యకా.

"శ్రీకృష్ణచింతనవలని విపులాహ్లాదము ఆమె పుణ్యకర్మములను క్షీణింపజేయ, కృష్ణుని ప్రాపింపనైతినిగదా యను మహాదుఃఖము ఆమె సర్వపాపములను నాశనమొనర్చెను: అంత నా గోపకన్యక ముక్తయయ్యెను."† మానవమానసమందలి కామక్రోధాదివికారములు స్వయముగా తప్పిదములుకావని గ్రహించుటయే భక్తియోగమందలి మూలరహస్యము. అయ్యవి మహోత్తమ స్థితి నొందువరకు వానిని అతిజాగరూకతతో నిగ్రహించుచు

* సాధనచతుష్టయసంపద్విహీనులై 'నేనే బ్రహ్మము' ననుచు, విధినిషేధములను దొలగి వర్తించు మిట్టవేదాంతులగు మూర్ఖులు, దుర్జనులు నిక్షేపాచింపబడుచున్నారు.

† విష్ణుపురాణము (5-13-21, 22).

సక్రమమార్గమున బ్రవర్తింపజేయుటయే * మన కర్తవ్యము. ఏయ్యది మనలను భగవదున్ముఖు లొనర్చునో అదియే సక్రమ మార్గము, ఉత్తమమార్గము, మిగిలిన వన్నియు అక్రమమార్గ ములు, పతనహేతువులు. సుఖదుఃఖములు సర్వజనసామాన్యము లనియు, తఱచుగా నెల్లరకు, ఎల్లవేళల గలుగుచునే యుండు ననియు మనము ఎఱుగుదుము. సిరిసంపదలు లేవనియో, మఱి యేదైనైహిక వస్తువు లభింపలేదనియో ఎవ్వడేని వేదనపడుచున్న యెడల తనవేదనను అక్రమమార్గమున బ్రవర్తింపజేయుచున్నవా డగును. ఐనను వేదనకు గూడ బ్రయోజన మున్నది. పరమార్థ మును దెలియనైతినని, భగవంతుని గాంచనైతినని ఎవ్వనినైనను వేదనపడనిండు; ఆ వేదన వానికి మోక్షప్రద మగును. దోసెడు కాసులు దొరకినవని నీవు సంతసించినయెడల అది నీ సంతోషము నకు అక్రమమార్గము. ఆ సంతసమునకు ఉత్తమమార్గమును జూపవలయును. మహోన్నతాదర్శప్రాప్తికి అయ్యది వినియో గింపవలయును. అట్టి దివ్యాదర్శప్రాప్తిచే గలుగు నానందము అత్యుత్తమముగదా! ఇతరమనోభావములన్నిటివిషయమునను ఇది వర్తించును. కామాదులలో ఏ మనోభావమును తప్పిదము కాదని భక్తుడు పల్కును. వాని నన్నిటి నాతడు చేబట్టి నిశ్చ యముగా భగవంతుని వైపునకు మఱల్చును.†

---

* దీనినే పాశ్చాత్యమానసికశాస్త్రజ్ఞులు Sublimation అందురు.

† సీ. "కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కు
శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు పురుషోత్తముని మీఁది బుద్ధిబుద్ధి

## పదునాల్గవ అధ్యాయము

## భక్తి ప్రకాశక రూపములు

భక్తిప్రకాశక రూపములను గొన్నిటి నిట దెల్పెదము. ఇందు మొదటిది సమ్మానము. * దేవాలయము లనినను, పుణ్య క్షేత్రములనినను జను లేల పూజ్యభావము జూపుచుందురు! భగవాను డచట ఆరాధింపబడుటచే, అట్టి తావులందెల్ల భగవానుడు వెలసియుండునని విశ్వసించుటచే చూపుచుందురు. ప్రతి దేశమందును జనులేల ధర్మప్రబోధకులను—ఆచార్యులను—గారవించుచుందురు? మానవహృదయమున కియ్యది సహజము. ఏలన, అట్టి ప్రబోధకు లెల్లరు భగవానునిగూర్చి ప్రచార మొన

తే. దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి."
—ఆంధ్ర భాగవతము, సప్తమస్కంధము, ప్రహ్లాదచరిత్ర (169)

శ్లో. "జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరమ్
పాణిద్వంద్వ సమర్చయాచ్యుతకథాః శ్రోత్రద్వయ త్వం శృణు,
కృష్ణం లోకయ లోచనద్వయ హరే ర్గచ్ఛాంఘ్రియుగ్మాలయమ్
జిఘ్ర ఘ్రాణ ముకుందపాదతులసీం మూర్ధన్నమాధోక్షజమ్."
—ముకుందమాల (25).

---

* "సమ్మాన బహుమాన ప్రీతి విరహేతరవిచికిత్సా మహిమఖ్యాతి తదర్థప్రాణస్థాన తదీయతా సర్వతద్భావాప్రాతి కుల్యాదీని చ స్మరణేభ్యో బాహుల్యాత్"—శాండిల్య భక్తిసూత్రము (2-1-44). ఈ యధ్యాయమున విశేషభాగము ఈ సూత్రము నాధారముగాగొని వ్రాయబడియున్నది.

ర్తురు. ప్రేమకుసుమము వికసించుటచే గలుగు పరిమళమే గౌరవము. మనము ప్రేమింపని వాని నెన్నడు గౌరవింప జాలము. తరువాత గమనింపవలసిన విషయము భగవత్ప్రీతి. విషయసుఖములనిన జనుల కెంత యానందము! ఎంత యాందో ళన! ఎంత గగుర్పాటు! తమకు ప్రీతికరమగు దానిని సంపాదిం చుటకై ఎంత దూరమైన వెడలుదురే! ఎంతకష్టమైన నోర్తురే! ఎంత యవమానమైన సహింతురే! ఇట్టి యపరిమిత ప్రేమను యొల్లనను భగవంతునివైపు మఱల్చుటయే భక్తుడు చేయవలసిన పని. తరువాతివిషయము వేదనలందెల్ల ప్రియతమమగు విరహ వేదన. భగవంతుని బొందనైతినిగదా యని, జ్ఞాతవ్యమగు పరతత్త్వమును దెలిసికొననైతినిగదా యని వేదనచే ఇంచు మించుగా పిచ్చివాడై పోయినవాని మనస్థితియే విరహము; ప్రియతమాన్య విషయములనుజూచి యాతడు వ్యాకులచిత్తుడై పోవును. ఈ స్థితియే ఇతరవిచికిత్స యని చెప్పబడును. లౌకిక మగు ప్రేమలో ఈ విరహ మెంత తఱచుగా గలుగుచుండునో చూచుచునేయున్నాము. మఱియు పురుషులు స్త్రీలను గాని, స్త్రీలు పురుషులనుగాని గాఢముగా ప్రేమించునపుడు వారికి ప్రేమపాత్రములుగాని వేవి కాన్పించినను సహజముగా ఒకవిధ మగు విసుగు—ఒకవిధమైన ఏవ—జనించుచుండును. సరిగా ఈ విధమగు నసహ్యమే పరభక్తివివశులగువారికి కామితాన్య విషయములయెడ గలుగును. భగవదితర విషయములను గూర్చినమాటయే, వారికి రుచింపదు. "తమేవైకం జానథ ఆత్మాన మన్యోవాచో విముఞ్చథ—* ఆతనిగూర్చియే, ఆ పర మాత్మనుగూర్చియే, చింతింపుము. ఆత్మేతర ప్రసంగములను

* ముండక. (2-2-5).

విసర్జింపుము.'' ఎవ్వరు భగవంతునిగూర్చి మాత్రమే ముచ్చటింతురో వారే తనకు మిత్రులని భక్తుడు భావించును; భగవదితర విషయములనుగూర్చి మాటలాడువారు ఆతనికి శత్రువులై తోచుచుందురు. ఇంతకంటెను ఉత్తమస్థితి కలదు. పరమప్రేమమూర్తియగు—తన జీవనజ్యోతియగు—భగవానునికొఱకు మాత్రమే తనువు నిలుపుకొనుటెఱిగి, అట్టి పరమప్రేమచేతనే జీవితము శోభావంతమనియు, జీవనార్హమనియు పరిగణించునపుడు భక్తుడు ఈ యుత్తమస్థితిని బొందుచున్నాడు. ఇదియే తదర్థప్రాణస్థానము అని చెప్పబడుచున్నది. ధ్యేయ్యాది ప్రాపించనట్టి అట్టి ఉత్తమభక్తుని జీవితము క్షణమైనను నిలువజాలదు. ప్రేమామృతసాగరమగు భగవానునిగూర్చి చింతించుటచేతనే జీవితము మనోహరమై యొప్పును. భక్తియోగము ననుసరించి మానవుడెపుడు పరిపూర్ణుడగునో, ధన్యుడగునో, భగవంతుని బ్రాపించునో, నిజముగా భగవచ్చరణారవిందములను స్పృశించునో—అపుడు తదీయత యనుస్థితి సిద్ధించుచున్నది. అప్పుడాతని స్వభావము పరిశుద్ధమై సంపూర్ణ పరిణామము నొందును; జీవిత పరమావధి ప్రాప్తమై జీవితోద్దేశము సఫలమగును. ఐనను ఇట్టి భక్తులలో అనేకులు కేవలము భగవాను నారాధించుటకే జీవించుచుందురు. ఆ పరమానందమును—జీవితైక మహాసుఖమును—వారు విడువనొల్లరు. ''ఓ రాజా! ఎవ్వరు ఆప్తకాములో, సంసారబంధవినిర్ముక్తులో అట్టి మహనీయులు సహితము భక్తికొఱకే హరిభజనము సేయుచుందురు.'' ''యం సర్వే దేవాః నమస్యన్తి ముముక్షవో బ్రహ్మవాదినశ్చేతి*—సమస్త దేవతలును, ముముక్షువులును, బ్రహ్మజ్ఞానులునుగూడ

* నృసింహతాపనీయోపనిషత్తు.

అర్పించునట్టివాడు భగవానుడు. భగవద్భక్తి యింత మహత్తర మైనది." కేవలము తన్నుగూడ మఱచి, "నాది యనునది యేదియులేదు" అని భావించునట్టి భక్తునకు తదీయత గలుగుచున్నది; అన్నియు ప్రేమపాత్రుడగు భగవానునివే యగుటచే నన్నియు భక్తునకు పవిత్రమే. లౌకిక ప్రేమలోగూడ కాముకునకు తాను ప్రేమించిన వనితయొక్క సర్వస్వము పవిత్రమై, ప్రియతమమై తోచుచుండునుగదా. తన ప్రియురాలిదగు చిన్న చీరయు నాతనికి ప్రేమనిలయమే. ఇటులే జగదీశ్వరుని ప్రేమించునపుడు సమస్తజగమును మనకు ప్రేమపాత్రమై యొప్పును. ఏలన, జగత్తు జగదీశ్వరునిదే గదా!



## పదునైదవ అధ్యాయము

## అఖిలభూతప్రేమ : తజ్జనితమగు ఆత్మార్పణము

సమష్టిరూపమగు సామాన్యమును (భగవంతుని) మనము ప్రేమింపనిదే వ్యష్టిరూపమగు విశేషమును (విశ్వమును) ప్రేమింపజాలము. భగవంతుడే ఈ సమష్టి, సామాన్యీకరింపబడిన నిర్విశేషపూర్ణము; మనకు గోచరించునట్టి యీ విశ్వమే విశేషరూపము. కోట్లకొలది చిన్నచిన్న యేకత్వములతో గూడుకొనిన ఒకే యేకత్వమనదగు ఈ సమష్టిని—సర్వసామాన్యమును—ప్రేమించుటచేతనే విశ్వమునంతను ప్రేమింపగల్గుదుము. భారతీయతత్త్వజ్ఞులు వస్తువిశేషములను గ్రహించుటతోడనే తమ జిజ్ఞాసను ముగింపక విశేషముల నొక్కసారి త్వరితగతి నవలోకించి వెంటనే, సమస్త విశేషనిలయమగు సర్వసామాన్య ధర్మములను—తత్త్వములను—గ్రహింపనారంభింతురు. సర్వ

సామాన్య ధర్మజిజ్ఞాసయే భారతీయమత వేదాంతముల జిజ్ఞాస. సమస్తధర్మమూలము, సమీకృతతత్త్వమునగు నేనిర్విశేషపర తత్త్వమును దెలిసికొనినచో సర్వము గ్రహించినవా డగునో అట్టి సంపూర్ణజ్ఞానమును బడయుటే జ్ఞానియాశయము. సమస్త ధర్మస్వరూపుడు, సమీకృతనిర్విశేష తత్త్వస్వరూపుడునగు నే పరమపురుషుని ప్రేమించినచో విశ్వమునంతను ప్రేమించినవాడగునో అట్టి పరమపురుషుని సాక్షాత్కారము వడయుటకై భక్తుడు తల్లడిల్లును. సమస్తశక్తినిలయము, సామాన్యీకృతమునగు నే శక్తిని వశపఱచుకొనినచో విశ్వమునంతను వశపఱచుకొనినవాడగునో అట్టి దివ్యశక్తినిబొందుటకై యోగి తపించును, పరితపించును. ప్రేమతత్త్వమునగాని, ప్రకృతిశాస్త్రమునగాని, విజ్ఞానమునగాని, వేదాంతమునగాని—సర్వవిషయములందును సామాన్యధర్మముల నన్వేషించుటకే వేదకాలమునుండి నేటివఱకు భారతీయమానసము ప్రవర్తితమైయున్నది. కావున కేవల మొకరివెంబడినొకరిని ప్రేమింపమొదలిడినచో పరాంతకాల పర్యంతమట్లు ప్రేమించుచునే యుండవచ్చునుగాని, ప్రపంచమునంతను మాత్రము ఏకముగా నెన్నటికిని ప్రేమింపజాలమనునదియే భక్తుని సిద్ధాంతము. ప్రేమ మంతటికిని పరమ ప్రయోజనము భగవానుడేయను ముఖ్యోద్దేశమువఱకు—ముక్తులైనను, బద్ధులైనను, ముముక్షువులైనను ప్రపంచమందలి సమస్తజీవులయొక్క వివిధాశయములకును గమ్యస్థానము భగవంతుడేయను ముఖ్యోద్దేశమునకు—వచ్చినపుడు మాత్రమే సర్వభూతములయందును ప్రేమ జూపుటకు ఎవ్వనికైనను సాధ్యమగును. భగవంతుడే ఈ సమష్టి; ఈ దృశ్యప్రపంచము వేఱుచేయబడిన ఆతని స్వరూపమే కాని మఱియొకటి కాదు. ఈ సర్వసామాన్య తత్త్వమును మనము

ప్రేమించినచో సర్వము ప్రేమించినవార మయ్యెదము. విశ్వ ప్రేమ, విశ్వహితము, సర్వము అపుడు సులభముగా సిద్ధించును; మొదట భగవానుని ప్రేమించుటచే మనము ఈ శక్తిని బడయుదుము; లేనచో జగద్ధితమనునది యంత సులభసాధ్యముగాదు. "సమస్తము భగవంతునిదే, అతడే నా ప్రియుడు, నే నాతని ప్రేమింతును, కామింతును" అని భక్తుడు పల్కును. అంతయు భగవానునిదే కావున విశ్వమంతయు ఆతనికి పవిత్రమై కన్పట్టును. ఆతనికి అందఱును భగవానుని బిడ్డలే, భగవచ్ఛరీరమే, భగవత్స్వరూపమే. అట్టిచో భక్తుడు ఎవ్వనికిగాని హానిచేయుట అసాధ్యముగదా. ఎవ్వనినిగాని, ఏ జీవజంతువునుగాని ప్రేమింపకుండుట అసంభవముగదా! ఇట్టి విశ్వేశ్వరప్రేమతో విశ్వమానవప్రేమ కలుగుననుట నిక్కువము. పరమేశ్వరుని సమీపించినకొలదియు సర్వము పరమేశ్వరునందే సంస్థితమైయున్నదని బాగుగా గ్రహింపనారంభింతుము. ఇట్టి పరమప్రేమను—పరభక్తిని—బడసినంతనే సర్వభూతములందును భగవానుని దర్శింపనారంభింతుము. అపుడు మన హృదయము శాశ్వత ప్రేమఝరియై విరాజిల్లును. ఈ ప్రేమ వికాసము చెందినకొలదియు ప్రాపంచిక భేదములన్నియు అదృశ్యము కానారంభించును; మానవుడు ఇక మానవుడుగా గాన్పింపడు, సాక్షాద్భగవత్స్వరూపుడై గన్పట్టును; జంతువు కేవలము జంతువవలెగాక జగదీశ్వరుడై గన్పట్టును; పులిగూడ నిక పులిగాదు, సాక్షాత్పరమేశ్వరస్వరూపము. ఇటు లీ పరభక్త్యవస్థలో ప్రతిమానవుని, ప్రతిప్రాణిని, ప్రతిభూతమును భక్తుడు ఆరాధించును. "ఏవం సర్వేషు భూతేషు భక్తి రవ్యభిచారిణీ కర్తవ్యాపండితై ర్జ్ఞాత్వా

సర్వభూతమయం హరిమ్*—హరి సర్వభూతమయుడని గ్రహించి సర్వభూతములందును నిశ్చలమగు భక్తి చూపుటయే విజ్ఞులకు కర్తవ్యము." ఇట్టి జగద్వ్యాప్తమగు నచంచల ప్రేమవలన సంపూర్ణమగు ఆత్మనివేదనభావము—మనకు ప్రతికూలముగా నేదియు సంభవింపదను దృఢనిశ్చయము—గలుగును. ఈ స్థితియే 'అప్రాతికూల్యము' అనబడును. ఇవ్విధమున ప్రేమపూర్ణుడగు మానవుడు తనకు కష్టమువచ్చినచో మనఃపూర్వకముగా నాహ్వానించును. అతని మానసము, ఎట్టిదుఃస్థితి సంభవించినను, "రమ్ము! నీవును నా ప్రేమమయునుండియే వచ్చుచున్నావు" అని యాహ్వానించును. త్రాచుపాము వచ్చినను "రమ్ము" అని ప్రేమతో బల్కును. † మృత్యువు వచ్చినను అట్టిభక్తుడు చిఱునగవుతో నాహ్వానించును. "అన్నియు నా యొద్దకే వచ్చుచున్నవి, ధన్యుడను నేను! అన్నిటికిని స్వాగతము!" ఇదియే భక్తునిభావన. గాఢమగునిట్టి భగవత్ప్రేమచే, భగవంతునివేయగు సర్వభూతములయందలి ప్రేమచే, జనించు నీ యాత్మార్పణబుద్ధివలన భక్తుడు తనకు గలుగు సుఖమును సుఖముగను, దుఃఖమును దుఃఖముగను పరిగణించుట మానును. ఎట్టిబాధ కలిగినను, ఎట్టి దుఃస్థితి సంభవించినను, మొఱలిడుటన నెట్టిదో యాత డెఱుగడు. ప్రేమస్వరూపుడగు భగవంతుని సంకల్పమే సదా నెఱవేఱుగావుతమను నిట్టి యాత్మార్పణబుద్ధి మహావీరకృత్య జనితౌన్నత్యము కంటెను, వైభవము కంటెను నిశ్చయముగా ఘనతరము, ప్రాప్యతరము.

* విష్ణుపురాణము (1-19-5).

† పవహారిబాబా యను గాజీపురపు సాధువును స్వామి స్మరించుచున్నట్లు గాన్పించెడిని.

మానవకోటియందు అధికసంఖ్యాకులకు శరీరమే వారి సర్వస్వము, శరీరమే వారి ప్రపంచము, శరీరసౌఖ్యమే వారి పరమావధి. ఈ శరీరారాధన పిశాచము, ఇంద్రియారాధన భూతము, మనల నందఱను ఆవేశించియున్నది. ఎన్ని ప్రగల్భములు పలికినను, ఎంత ఆకాశపథమున కెగిరినను తుదకు మనము పట్టిగ్రద్దలము, రాబందులము; క్రిందనున్న కామకాంచన శవములమీదనే మనదృష్టి లగ్నమైయుండును.* పులిబారిపడకుండ మన శరీరము నెందులకు రక్షించుకొనవలయునో చెప్పుడు. పులికేల మన శరీరము నర్పింపరాదు?† దానిచే పులి సంతసించునే! తృప్తినొందునే! అటులొనర్చుట స్వార్థత్యాగముకంటె—పరమేశ్వరారాధనకంటె—భిన్నము కాదే! స్వార్థపరత సంపూర్ణముగా నశించిన యిట్టి మహోన్నతాదర్శము నెన్నడైనను మీరు సాధింపగలరా? ఇదియేగదా ప్రేమతత్త్వమహోన్నత శిఖరము! ఈ శిఖరము నధిరోహింపగల్గినవారు మిక్కిలి తక్కువగా నుందురు; కాని సదా, మనఃపూర్వకముగా నిట్టి త్యాగమునకు సంసిద్ధుడు కానిదే మానవు డెన్నటికిని పరిపూర్ణభక్తుడు కాజాలడు. ఇంచుమించు తృప్తికరముగా మన మందఱము ఇంతకాలమో, అంతకాలమో శరీరమును కాపాడుకోవచ్చును. కాని యెన్నటికైనను ఈ శరీరము తుదకు నశింపక తప్పదు; శరీరము శాశ్వతముకాదు. లోకకల్యాణయత్నమున, లోకసేవా

* ఇయ్యది శ్రీ రామకృష్ణపరమహంస సూక్తిని స్మరింపజేయుచున్నది.

† బుద్ధుడు ఒకానొక పూర్వజన్మమున తన శరీరమును పులికి అర్పించెనని బుద్ధజాతక కథలలో జెప్పబడినది. మఱియొకతావున స్వామి యొకానొక మహాత్ముడు "శివోహమ్" అనుచు తన శరీరమును పులికి అర్పించెనని చెప్పియున్నాడు.

చరణమున నెవ్వని శరీరము జీర్ణించునో వాడే ధన్యాత్ముడు. "సిరిసంపదలను, ప్రాణమును సైతము లోకహితార్థము వినియోగించుటకై మహాత్ములు సదా సంసిద్ధులైయుందురు. లోకములో అన్నిటికంటెను ఒక్కటి, అనగా మరణము, ఎల్లవారికి ధ్రువమై యుండుటచే ఈ శరీరము సదుద్యమమున జీర్ణించుటయే శ్రేయస్కరము." ఏబదియేండ్లో లేక నూరేండ్లో జీవితము సాగింతుము గాక, కాని తరువాత సంభవించున దేమి? పుట్టినవెల్ల గిట్టక తప్పదుగదా. సృష్టిలో సంయోగము నాశ్రయించుకొనియే వియోగము ఉన్నది. సమస్తము విలయమగు కాలము వచ్చితీరును.* బుద్ధుడు, మహమ్మదు, జీసస్—వీ రెల్లరును మరణించిరి; జగద్గురువులును ప్రవక్తలునుగూడ మరణించిరి. సమస్తము మృత్యువువాతబడు నీమర్త్యలోకమున మన నియమిత కాలమును సద్వినియోగమొనర్చుకొనుటే మన కర్తవ్యము, ఇదియే భక్తుని యభిప్రాయము. నిక్కముగా జీవితసద్వినియోగము సర్వభూతసేవయే కాని వేఱొండుగాదు. "శరీరమే మనము" అను నీభ్రమతో—శరీరరక్షణశరీరసంతృప్తులకై సర్వవిధములను శక్తికొలదియు యత్నింపవలయునను నీభ్రాంతితో—గూడిన ఘోరమగు నీశరీరాభిమానమే స్వార్థపరాయణతకు మూలము. నీ శరీరముకంటె నిశ్చయముగా నీవు భిన్నుడవని గ్రహించినయెడల ఎవ్వరితోడను నీవు పోరాడనక్కఱలేదు, ఎవ్వరితోడను విరోధపడనక్కఱలేదు. స్వార్థభూయిష్ఠమగు సమస్త భావములును అపుడు తమంత తామే తొలగిపోవును.

---

* "సర్వే క్షయాన్తా నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రియాః,
సంయోగా విప్రయోగాన్తా మరణాన్తం హి జీవితమ్."
—మహాభారతము, మోక్షధర్మము (330-20).

కావున మనము సాంసారిక విషయములయెడ మృతప్రాయులమై యుండవలయుననియు ఇదియే నిజమగు ఆత్మార్పణమనియు భక్తుడు వక్కాణించును. సుఖదుఃఖాదులను యథేచ్ఛముగా రానిమ్ము. "నీయిచ్ఛయే నెఱవేఱుగాక!" * యను వచనమున కిదియే తాత్పర్యము కాని, ఊరక పోరాడుచు, ప్రయాసపడుచు, మన లోపములును, దోషములును, విషయవాంఛలనుగూడ భగవదిచ్ఛయేయని తలపోయుట కాదు. స్వార్థపరమగు యత్నములచేగూడ నొకప్పుడు మేలు కలుగవచ్చును. కాని యది పరమేశ్వరసంకల్పము. స్వప్రయోజనమును ఆశించుటకాని, అందులకై కృషిచేయుటకాని, యెన్నటికిని పరిపూర్ణుడగు భక్తుని యాశయము కానేరదు. "ప్రభూ! నీపేర వారు పెద్దపెద్ద దేవాలయములు కట్టుదురు; గొప్ప దానధర్మము లొనర్తురు. నేను దీనుడను, దరిద్రుడను, కావున ఈనా శరీరమును నీకు సమర్పింతును. కైకొనుము! తండ్రీ! నన్ను విడువకుము!" ఇదియే భక్తుని హృదయాంతరాళమునుండి వెలువడు ప్రార్థన. ప్రేమమూర్తియగు భగవానునకు ఇవ్విధమగు ఆత్మార్పణమును గావించుకొనినభక్తుడు తన యాత్మసమర్పణమును సమస్త సంపదలకంటెను, భోగానుభవములకంటెను, జగద్విఖ్యాతికంటెను ఘనతరమని భావించును. ఇట్టి వినిర్మలాత్మనివేదనముచే గలుగు ప్రశాంతి భావనాతీతము.† ఇదియే పరమపురుషార్థము. ఇదియే అప్రాతికూల్యము అను మనఃస్థితి. ఇట్టి మనఃస్థితి నొందిన భక్తునకిక నేవిధమగు స్వార్థచింతయు నుండనేరదు. సమస్తము ఆతనికి

---

* "Thy will be done"—Bible, St. Matthew (6-10).

† "And the peace of God which passeth all understanding"—Bible, Philippians (4-7).

అనుకూలమే. సృష్టి స్థితిలయకారకుడగు భగవానునియందు దక్క ఇతరమునందు దాతనికి ఆసక్తి సంపూర్ణముగా నశించును. భగవత్ప్రేమరూపమగు నీయనురాగము ఆత్మబంధహేతువులైన, సమస్తబంధములను విచ్ఛిన్న మొనర్చును.

---

## పదునాఱవ అధ్యాయము

### నిజమైనభక్తునకు పరభక్తియు ఆత్మజ్ఞానము నొక్కటే

పరవిద్యయు అపరవిద్యయునని ఉపనిషత్తులు జ్ఞానమును విభజించును. భక్తునిదృష్టిలో పరవిద్యకును పరభక్తికిని నిజముగా నెట్టి భేదమును లేదు. "ద్వేవిద్యే వేదితవ్యే ఇతి హ స్మ యద్బ్రహ్మవిదోవదన్తి । పరాచైవాపరాచ । తత్రాపరా — ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వవేదః శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దో జ్యోతిషమితి। అథ పరా యయా తదక్షరమధిగమ్యతే॥ * —పరవిద్యయనియు అపరవిద్యయనియు తెలియదగినవిద్య రెండువిధములని బ్రహ్మవేత్తలు వక్కాణింతురు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము, శిక్ష (లేక వేదోచ్చారణశాస్త్రము), కల్పము (లేక యజ్ఞవిధానమును బోధించుశాస్త్రము), వ్యాకరణము, నిరుక్తము (లేక శబ్దార్థశబ్దనిష్పత్తులను గూర్చినశాస్త్రము), ఛందస్సు (లేక కావ్యలక్షణశాస్త్రము), జ్యోతిషము—వీనితో గూడినది అపరవిద్య; దేనివలన అక్షరపరబ్రహ్మజ్ఞానము గలుగునో అదియే పరవిద్య." దీనివలన బ్రహ్మజ్ఞానమే పరవిద్యయనుట స్పష్టము.

---

* ముండక. (1-1-4. 5).

ఇక పరభక్తినిగూర్చి శాస్త్రము లిట్లు తెల్పును: † "ఒక పాత్ర నుండి మఱియొక పాత్రలోనికి పోయబడు చమురు, అవిచ్ఛిన్న మగు నేకధారగా బడునట్లు మానసము అవిచ్ఛిన్నప్రవాహరూప మున పరమేశ్వరునిగూర్చి చింతించునపుడు మనకు పరభక్తి సిద్ధించుచున్నది." నిశ్చలము, నిరంతరము, అనురాగయుతము నగునిట్టి భగవచ్చింతనమే భగవానునియెడ మనకు గలుగు మహోన్నతప్రేమను బ్రకటించును. ఇతరమగు భక్తిరూపము లన్నియు మహోన్నతమగు నిట్టి పరభక్తిని బడయుటకు సాధనలు. ఈ దివ్యప్రేమ హృదయమున జనించినంతనే భగవచ్చింతనము నకు దక్క ఇతరచింతనములకం దెడము ఉండదు. భక్తుని మానసమవు డత్యంతపవిత్రమైయున్నకతన సమస్తమనోబంధము లును బ్రకృతి బంధములును తుత్తునియలై పోవును; ముక్తికాంత యాతని వరించును; ప్రశాంతి యాతనికి కరతలామలకమగును; తన హృదయసింహాసనమున భగవానునారాధించుట కాతడొక్కడే అర్హుడు. అర్చావిధులు, ప్రతీకములు, గ్రంథములు, సిద్ధాంతములు—ఇవి అన్నియు ఆతనికి అనావశ్యకములు, నిష్ప్రయోజనములు. భగవాను నివ్విధమున బ్రేమించుట అతిదుర్లభము. ప్రేమ కెచట ప్రేమ ప్రతిఫలించునో అచటనే సాధారణముగా మానవప్రేమ వికసించుటను గాంతుము. ప్రేమకు ప్రతిఫలమగుప్రేమ సిద్ధింపనిచో కేవలనిర్లక్ష్యమును వహించుచుందుము. ప్రేమరూపమగు ప్రతిఫలము లభింపనప్పుడు ప్రేమించుటరుదు. ప్రతిఫలాపేక్షలేనిప్రేమ మిడుతకు అగ్నిపైగల ప్రేమ

---

† "ధ్యానంచ తైలధారావ దవిచ్ఛిన్నస్మృతిసంతానరూపమ్"—అని ధ్యానమునుగూర్చి యింతకుముందే బ్రహ్మసూత్ర రామానుజభాష్యమునుండి ఉదాహృతము.

వంటిది. మిడుత మంటను ప్రేమించి దానిలో బడి ప్రగ్గును. ఇట్టి ప్రేమ యాపుర్వునకు సహజము. సహజముగనే ప్రేమించుటనునది లోకమున గాననగు మహోత్తమము, స్వార్థరహితమునగు ప్రేమకు నిదర్శనమను టెంతయు నిశ్చయము. పారమార్థికమగు నిట్టి మహోన్నతప్రేమయే పరభక్తి సాధనము.



## పదునేడవ అధ్యాయము

## ప్రేమలక్షణత్రయము

ప్రేమస్వరూపమును ఇచట తెలుపబడు లక్షణత్రయముచే నిరూపింపనగును. ఫలాపేక్ష లేకుండుట, నిర్భయత్వము, తాను ప్రేమించినదియే మహోత్తమమని భావించుట యను నీమూడును లేనిదే నిజమైన ప్రేమము ఉండజాలదు. ఫలాపేక్ష లేకుండుట యనగా "ఇదిగో నా ప్రేమ, దీని కేమిచ్చెదవు!" అని బేరమాడకుండుట. ఎచట ఫలాపేక్షగలదో అచట నిష్కామగు ప్రేమము ఉండజాలదు; ఫలాపేక్షయున్నచో అది వట్టి వర్తకమన్నమాట. మన భక్తివిశ్వాసములకు ప్రతిగా భగవంతుని వలన ఏ వరమో పొందవలయునను భావము మనలో నున్నంత వఱకు నిజమగుప్రేమ మన హృదయమున పెంపొందజాలదు. తమకు వరముల నిచ్చునను భావముతో భగవంతునర్చించువారు అయ్యవి లభింపనియెడల భగవంతు నర్చింపరనుటెంతయు నిశ్చయము. భగవంతుడు ప్రేమపాత్రుడను హేతువుచేతనే భక్తుడాతని ప్రేమించును; నిష్కామగు భక్తుడు జూపు నీ దివ్యప్రేమకు, వేఱొండు కారణము లేదు ; ఉద్దేశము లేదు. వెనుకటి కొక మహారాజు అరణ్యమునకు వెడలి యొక మహర్షిని గాంచెను.

మహర్షితో నాత డించుక సంభాషించి, యాతని విశుద్ధతను జ్ఞానమును గాంచి యమిత సంతుష్టుడై, "నా యొద్దనుండి యేదైన పరిగ్రహించి న న్ననుగ్రహింపుడు" అని కోరెను. మహర్షి యందులకు నిరాకరించుచు నిట్లు వచించెను: "ఓ రాజా! వనమున నా యాహారమునకు వలసినన్ని పండ్లు లభించును; చక్కని సెలయేళ్లనుండి త్రాగుటకు వలసినంత మంచి నీరు దొరకుచున్నది; చెట్లనుండి లభించు నారలు నా వస్త్రములకు సరిపోవును; కొండగుహాలు నా నివాసమును నిర్మించును; ఇట్టి యెడ నీవలనగాని, మఱియెవ్వరివలనగాని పరిగ్రహించుట నాకు అనావశ్యకముగదా!"* అది విని రాజు ఇట్లనియెను: "స్వామీ! నాయొద్దనుండి యేదియైనను గైకొని న న్ననుగ్రహింపుడు! పురమునకు వచ్చి నా యంతఃపురమునకు దయచేయుడు." రాజు ఇట్లు చాలసేపు ప్రతిమాల తుదకు ఋషి యంగీకరించి రాజాంతః పురమునకు వెడలెను. తాను కోరినది ఋషికి అర్పించుటకు ముందు రాజు ఇట్లు భగవంతుని ప్రార్థింపసాగెను: "లోకరక్షకా! నాకు అధికసంతానము నిమ్ము; ప్రభూ! నాకు అధికసంపదల నిమ్ము, అధికరాజ్యము నిమ్ము; పరమేశ్వరా! నాకు అధికారో

---

* శ్లో. "ఫలం స్వేచ్ఛాలభ్యం ప్రతివన మఖేదం క్షితిరుహామ్
పయస్స్థానే స్థానే శిశిరమధురం పుణ్యసరితామ్,
మృదుస్పర్శా శయ్యా సులలితలతా పల్లవమయీ
సహన్తే సన్తాపం తదపి ధనినాం ద్వారి కృపణాః."

చ. "కలవు ఫలేశిమంబులయి కానలలోపలఁ బండ్లు ప్రాకులన్
గలవు పవిత్రవాహినులఁ గమ్మని శీతలవారిపూరముల్
గలవు చివుళ్లపాన్పులవి గైకొననేరక దీనులై ధనా
ఢ్యులగవనిన్ వసించి నరు లోలిసహింతురు తీవ్రతాపమున్."
—భర్తృహరి వైరాగ్యశతకము, యాచ్ఞాదైన్యదూషణము (27).

గ్యము నిమ్ము." రాజు తనప్రార్థనను ముగించుటకు ముందే అంతఃపురమునుండి ఋషి లేచి చల్లగా వెడలిపోయెను. అది చూచి రాజు ఆందోళనముతో ఋషిని వెంబడించుచు నిట్లు మొఱలిడసాగెను : "స్వామీ వెడలిపోవుచుంటివా! నా కానుక లను ప్రతిగ్రహింపకుండ వెడలిపోవుచుంటివా! న న్ననుగ్రహింపవా?" ఋషి యిట్లు ఉత్తరమొసగెను : "అయ్యా! నేను యాచకులను యాచించువాడను గాను! స్వయముగా బిచ్చగాడ వగు నీవు నాకేమి యీయగలవు? నీవంటి భిక్షుకునుండి పరిగ్రహించుటకు నేను మూర్ఖుడను గాను. పొమ్ము! నన్ను వెంబడింపకుము!" భగవంతు నిది కావలయు నదికావలయునని దేవిరించు వట్టి భిక్షుకులకును నిక్కమగు భగవద్భక్తులకును గల తారతమ్య మిందు చక్కగా నిరూపింపబడినది. ఫలాపేక్షతో ప్రాకులాడుట ప్రేమలక్షణము కాదు. సాయుజ్యముక్తికొఱకే యైనను, మఱి యే యితరాసక్తిచేనైనను భగవంతు నుపాసించుటగూడ నింద్యమే. ఫలాపేక్షయున్నచో అది ప్రేమగాదు. అవ్యాజమైన ప్రేమయే ప్రేమ. ప్రేమింపకుండ నుండుట తనకు స్వభావ విరుద్ధము గావున భక్తుడు ప్రేమించును. రమ్యమగు ప్రకృతి దృశ్యమును గాంచి నీవు ముగ్ధుడవైనయెడల ఆ దృశ్యము నిన్నే మైన కటాక్షింపవలయునని ఆశింపవుకదా! అటులే ఆ దృశ్యమును నీవలన నే ప్రతిఫలమును ఆశించుటలేదు. కాని యా ప్రకృతిదృశ్యము నిన్ను పరమానందభరితుని జేయుచున్నది; నీ చిత్తవిక్షేపముల నణచి నీ కది ప్రశాంతిదాయకమగుచున్నది. తాత్కాలికముగా నైనను నిన్నది మానవ స్వభావాతీతునొనర్చి నీకు ఆత్మసుఖానుభూతి నొసగుచున్నది. సహజముగా ప్రేమించుటయే ప్రేమకు ప్రధానలక్షణము. నీ ప్రేమకు ప్రతిఫల మెన్న

జాశింపక సదా ప్రేమదాతవై వర్తింపుము. నీ ప్రేమను భగవానునకు అర్పింపుము. కాని భగవంతునుండిగూడ ప్రతిఫలము అపేక్షింపకుము.

నిర్భయత్వమనునది ప్రేమకు రెండవలక్షణము. భీతిచే భగవానుని ప్రేమించువారు అత్యల్పులు, ఇంకను వికాసము నొందని మానవ మాత్రులు. తమ్ము శిక్షించునను భీతిచే వారు భగవంతు నుపాసింతురు. భగవానుడు వారికి పెద్దయముడు. భగవంతునియెడ విధేయత జూపనిచో తమ్ము శిక్షించునేమో యని వారి భయము. ఇట్టి భయముచే భగవాను నుపాసించుటతిహేయము; అదియు నొకవేళ ఉపాసనయే యని యంగీకరించినను అయ్యది పరమ నికృష్టమగు నుపాసనయని చెప్పవలయును. మానసమున భయ మున్నంతవఱకు అందు ప్రేమకు తావులేదు. ప్రేమ సహజముగా భీతిని జయించును. యువతియగు నొకతల్లి వీథివెంట నడలుచుండ నొకకుక్క యామెను జూచి మొఱుగుచున్న దనుకొనుడు; ఆమె భయపడి చెంతనున్న యింటిలోనికి పరుగెత్తును. కాని మఱునా డామె తన బిడ్డతో వీథిలో నుండగా నొక సింహ మా బిడ్డపై నుఱుకుననుకొనుడు. అవు డామె యేమిచేయును? తన బిడ్డను రక్షించుటకై సింగవు గట్టెదుట దుముకునుగదా. ప్రేమ సమస్తభీతిని జయించును. ఎంతసేపు "మాకు ఆయుష్యము, మాకు ఆరోగ్యము" అను స్వార్థపరత్వమే భీతికి పుట్టినిల్లు. అల్పులము, స్వార్థపరులము ఐనకొలదియు మన భయము అధికమగుచుండును. మానవుడు తాను వట్టి పనికిమాలినవాడననియు, అనామకుడననియు భావించునపుడు భయ మాతని నావేశించును. అల్పుడనని భావించుటల్పమైన కొలదియు భీతియు అల్పమగుచుండును. లేశమేని

భయమున్నంతవఱకు నీ హృదయమున ప్రేమ కెడముండదు. ప్రేమయు భయమును పరస్పర విరుద్ధములు; భగవంతుని ప్రేమించు వా డెన్నడును భగవంతుడనిన భయపడజాలడు. "వ్యర్థముగా భగవన్నామమును గ్రహింపకుము"* అను క్రైస్తవోపదేశమును జూచి నిజమగు భక్తుడు నవ్వును. ప్రేమ తత్త్వావలంబనమున అపచార మెట్లు వాటిల్లును? భగవన్నామము నెట్లు స్మరించినను సరియే, ఎంత స్మరించిన మనకంత శ్రేయస్కరము. † భగవత్ప్రేమచేతనే నీ వాతని నామమును స్మరింతువు, జపింతువు.

కామితార్థమే సర్వోత్తమమనునది ప్రేమకు మూడవ లక్షణము. ప్రేమికి తన కామ్యమున మహోత్తమాదర్శము మూర్తీభవించియున్నట్లు తోచును. మన ప్రేమకు లక్ష్యభూతమగునది మన మహోత్తమాదర్శము కానిదే మనకు నిజమగు ప్రేమ కలుగజాలదు. పెక్కు సమయములలో మానవప్రేమ తప్పుత్రోవను బట్టుగాక, అనర్హులందు ప్రసరించుగాక, కాని ప్రేమికి తాను ప్రేమించినదియే మహోత్తమాదర్శము. ఒకడు పరమదుర్మార్గునియందు తన యాదర్శమును గనుగాక, మఱి యొకడు పరమసన్మార్గునందు గాంచుగాక; ఎచ్చటనైన ఆదర్శము మాత్రమే నిజముగా ప్రేమపాత్రమగుచున్నది. ప్రతిమానవుని అత్యున్నతాదర్శమునకే భగవంతుడని పేరు. అజ్ఞునకును ప్రాజ్ఞునకును, పాపాత్మునకును పుణ్యాత్మునకును, స్త్రీకిని పురుషునకును,

---

* "Thou shalt not take the name of the lord thy God in vain." —Bible, Exodus (20-7).

† సంకేతపరిహాసాది రూపముననైనను భగవన్నామ ముచ్చరించినచో శ్రేయోదాయకమని భాగవతాదులలో జెప్పబడినది.

విద్వాంసునకును విద్యావిహీనునకును, సంస్కారయుక్తునకును సంస్కార విహీనునకును—ప్రతి మానవునకును భగవంతుడే మహోన్నతాదర్శము. ఆదర్శసౌందర్యము, ఆదర్శవైభవము, ఆదర్శశక్తియను దివ్యాదర్శముల సమన్వయమే ప్రేమాంబుధియు ప్రేమపాత్రుడునగు భగవానునిగూర్చి మనకు సమగ్రమైన భావము నొసగును. ఈ యాదర్శములు సహజముగా ప్రతి మానవునందును ఏదియో యొకరూపమున నుండును; మన యందటి మానసములకును ఇయ్యది సహజము. ఈ యాదర్శములు దైనందిన జీవితమున ఆచరణలోనికి వచ్చుటకు చేయు ప్రబలయత్నమే మానవ స్వభావమునందలి తీవ్ర సంచలనము. వివిధ మానసములందు వివిధాదర్శములు రూపొంద యత్నించుచుండును, ఇవియే సంఘమున గాన్పించు వివిధోద్యమములన్నిటికిని కారణము. అంతర్గతమై యున్నది వెలువడుటకై ప్రబల యత్న మొనర్చుచుండును. అపారము, నిరంతరమునైన ఈ యాదర్శముయొక్క ప్రభావమే మానవకోటిలో కార్యరూపము నొందునట్టి అద్వితీయప్రేరణశక్తి. మానవుడు తా నవలంబించు నాదర్శముచే బాహ్యపరిస్థితులను పూర్తిగా తనకు అనుకూలించునట్లు చక్కజేయుటకై, మార్చివేయుటకై యత్నించుట కేవలము వ్యర్థమని జన్మజన్మాంతరముల యనంతరము—వేలకొలది విశ్వప్రయత్నములు చేసినపిమ్మట—గ్రహించునేమో! కాని యీ సత్యమును గ్రహించినపిమ్మటమాత్రము ఇక నాతడు ప్రపంచమున తన యాదర్శమును వ్యక్తమొనర్చుటకై యత్నింపడు. విశేషము, అత్యుత్తమ ప్రేమభావముతో ఆదర్శము నాదర్శరూపముగనే యుపాసించును. సమగ్రమైన యీ దివ్యాదర్శము సమస్తాదర్శనిలయము. "తా వలచినది రంభ, తా మునిగినది గంగ"

యనుసామ్య మందఱెఱిగిన దేకదా. బయటనుండి సాక్షియై చూచువానికి మాత్రము ఇచటి ప్రేమకు ఔచిత్యము గాన్పింపక పోవచ్చును; కాని కాముకునకు మాత్రము తా వలచినది రంభయే, మూఢవిశ్వాసపరునకు తా మునిగినది గంగయే; వానికి అన్యము ఎన్నడును తట్టదు. "కాకిపిల్ల కాకికి ముద్దు" అనునట్లు మన యాదర్శము లెప్పుడును మన కామితవిషయములందే లగ్నమైయుండును. కాని లోకము సాధారణముగా ప్రేమించున దేమి? దివ్యప్రేమికిని పరభక్తునకును ఆదర్శప్రాయమైన యీ పరిపూర్ణాదర్శము, సర్వతోముఖాదర్శముమాత్ర మెన్నటికిని కాదు. స్త్రీపురుషు లెల్లరు సర్వసాధారణముగా నుపాసించు నాదర్శము తమలోనున్నయాదర్శమే. ప్రతివ్యక్తియు స్వీయాదర్శమును బాహ్యప్రపంచమున నిర్మించుకొని దానికే అంజలి ఘటించుచుండును. పరమక్రూరులును, రాక్షస స్వభావులు నగువారు భగవంతునిగూడ రాక్షస స్వభావునిగనే యెంచి అట్టి మూర్తినే యుపాసించుచుండుట కిదియే కారణము. ఎవ్వరైనను స్వీయోన్నతాదర్శమేకదా ప్రేమింపగల్గునది! సజ్జనులకు భగవానునిగూర్చి సమున్నతాదర్శ ముండుటకుగూడ నిదియే హేతువు. ఇతరుల యాదర్శమునకును సజ్జనులయాదర్శమునకును ఎంతయో వ్యత్యాసముండును.



## పదునెనిమిదవ అధ్యాయము

## ప్రేమమూర్తియగు భగవానుడు స్వతస్సిద్ధుడు

స్వార్థత్యాగియు, ఫలాపేక్షారహితుడు, నిర్భయుడునగు భక్తుని యాదర్శమేమి? సాక్షాద్భగవానునితోగూడ నాత డిట్లు వచించును : "ప్రభూ! నాసర్వస్వమును నీకు అర్పింతును, నీవలన నా కేదియువలదు, నిజముగా నాది యనునది నా కేదియు లేనే లేదు." ఈ నిశ్చితాభిప్రాయమునకు వచ్చినంతనే భక్తుని యాదర్శము భయరహితమై, పరిపూర్ణప్రేమరూపమై యొప్పును. ఇట్టి మహనీయుని దివ్యాదర్శమున సంకుచితబుద్ధిగాని ప్రత్యేక దృష్టిగాని లేశమైన నుండుటకు అవకాశములేదు. ఇదియే సర్వభూతప్రేమ, అనంతప్రేమ, అద్వితీయప్రేమ. ఇదియే ప్రేమస్వరూపము. ప్రతీకాపేక్షగాని ప్రతిమావశ్యకముగాని లేకయే ఇట్టి దివ్యాదర్శప్రేమతత్త్వము ఉపాస్యమై ప్రేమ నిలయమై ప్రకాశించును. సర్వాదర్శనిలయమగు నిట్టి దివ్యాదర్శమును ఆదర్శముగా గ్రహించి యుపాసించుటయే పరభక్తి యనబడును; ఇతరభక్తి రూపములన్నియు నిందులకు కేవల సోపానములు. ఇట్టి దివ్యప్రేమతత్త్వావలంబనమున మనకు గలుగు జయాపజయములు అన్నియు పరభక్తిప్రాప్తికి కేవల సాధనలు, పరమావధిని జేరు (భక్తి) మార్గమందలి మజిలీలు. ఒక యాలంబము వెనుక నొకటిగా అనేకాలంబములను గైకొనుచు, అంతరాదర్శమును వానియందు క్రమముగా అభివ్యక్త మొనర్చుచుందుము; కాని అయ్యవి నిరంతరవికాసమును జెందు నాయంతరాదర్శమును వ్యక్తమొనర్పజాలమి క్రమముగా వానిని విడనాడుచుందుము. సాధకుడు ఎట్టకేలకు బాహ్యావిషయ

ములందు తనయాదర్శమును గనుగొన యత్నించుట నిరర్థకమని, ఆదర్శముతో బోల్చిచూచిన, బాహ్యవిషయములన్నియు కేవల హేయములని గ్రహింపనారంభించును. మఱియు సకాలమున నాతడు మహోత్తమము, సమీకృతనిర్విశేషమునగు నాదర్శమును ఆదర్శస్వరూపముననే కనుగొన సమర్థుడగును. అట్టివానికే ఆదర్శము ప్రాణవంతమై యథార్థమైకన్పట్టును. భక్తుడీయుత్తమస్థితికి వచ్చినంతనే భగవంతునియస్తిత్వము నిరూపణీయమగునా కాదాయని విచారించుట ఆతనికి అనావశ్యకము; భగవంతుడు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు నగుట నిజమా కాదా యను విషయము ఆతనికి అవిచార్యము. భగవానుడాతనికి కేవలప్రేమమూర్తి — ప్రేమజ్యోతి — ఆదర్శప్రేమస్వరూపుడు—భక్తున కిది చాలును. ప్రేమ రూపమున వెల్గొందు భగవానుడు స్వయంప్రకాశమానుడు. ప్రేమకి తన ప్రేమజ్యోతి యొక్క నిరూపణము అనావశ్యకముగదా. ఇతరమతవిధానములందలి చండశాసనదైవములను నిరూపించుటకు అనేకప్రమాణములు కావలసివచ్చునేమోకాని భక్తుడు అట్టి దైవములనుగూర్చి తలపోయనే తలపోయడు, తలపోయజాలడు. భగవంతుడు ఆతనికి కేవల ప్రేమమయుడు. "నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి, ఆత్మనస్తుకామాయ పతిః ప్రియో భవతి; నవా అరే జాయాయై కామాయ జాయాప్రియా భవతి, ఆత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి * —ప్రేయసీ! పతికొఱకే ఎవ్వరును పతిని ప్రేమించుటలేదు, పతియందలి అంతరాత్మకొఱకపతి ప్రియుడగుచున్నాడు; సఖీ! భార్యకొఱకే ఎవ్వరున భార్యను ప్రేమించుటలేదు; ఆమెయందలి అంతరాత్మకొఱక

* బృహదారణ్యక. (2-4-5).

భార్య ప్రియురాలగుచున్నది.'' స్వార్థపరత్వమే మానవ యత్నము లన్నిటికిని ప్రేరణశక్తియగు మూలకారణమని కొందఱి యభిప్రాయము. విమర్శించిచూచిన నిదియు అవనతమగు ప్రేమయే, కాని ప్రేమ యిచట ప్రత్యేకింపబడుచున్నది—వ్యక్తిగతమగుచున్నది. సమస్త జగద్వ్యాపకుడను నేనే యని భావించునపుడు నాలో స్వార్థపరత్వముండుటకు అవకాశము లేదు; కాని నే నొక అల్పవ్యక్తినని భ్రమించునపుడు నా ప్రేమ సంకుచితమై ప్రత్యేకింపబడుచున్నది. ప్రేమపరమావధిని సంకుచితమొనర్చుటయే మనయొక్క ప్రమాదము. చరాచర ప్రపంచమంతయు సర్వేశ్వరసంజనితమే కావున మనకు ప్రేమపాత్రమై యొప్పును. ఐనను అశేషప్రేమలో విశేషప్రేమ యిమిడియున్నదని మాత్రము మనము జ్ఞప్తిలో నుంచుకొనవలయును. ఈ యశేష ప్రేమరూపమే భక్తులకు ఆరాధ్యుడగు భగవానుడు ; ఇతరములగు సమస్తదైవములు, దేవతలు, లోకపాలకులు, సృష్టికర్తలు, వాదములు, సిద్ధాంతములు గ్రంథములును అట్టి భక్తులకు అర్థరహితములు, అనావశ్యకములు. ఏలన మహోత్తమమగు తమదివ్యప్రేమచే—పరభక్తిచే— వీనినన్నిటిని వారతిక్రమించియున్నారు. హృదయము అకలంకమై దివ్యప్రేమామృతపూరితమగునపుడు భగవానునిగూర్చిన యితరభావములన్నియు హేయములుగను అయోగ్యములుగను గన్పట్టును. కావున భక్తుడు వానిని నిరాకరించును. నిజముగా పరభక్తి యిట్టి మహత్తరమైనప్రేమ, పటుతరమైనప్రేమ. పరిపూర్ణుడగు భక్తుడిక ప్రార్థనాలయములకును, ఆలయములకును, భగవద్దర్శనార్థమై వెడలడు. "ఇందు గలడందు లేడను సందేహము వలదు, చక్రి సర్వోపగతుండు...'' అనునట్లు భగవంతుడాతనికి

సర్వాంతర్యామియై సాక్షాత్కరించును. అట్టి భక్తునకు భగవానుడు లేని తావే లేదు. దేవాలయమందును దేవాలయము వెలుపలనుగూడ నాతడు భగవంతుని గనును. సజ్జనునిపవిత్రత యందును దుర్జనునిదౌర్జన్యమునందునుగూడ నాతడు భగవానుని గాంచును : సర్వశక్తిమంతము, నిరామయప్రేమప్రదీపమునగు పరంజ్యోతి యాతని హృత్పీఠమున సదా దేదీప్యమానమై వెల్గొందు చుండునుగదా !



## పందొమ్మిదవ అధ్యాయము

## భక్తి సాంకేతికరూపములు

పరమాదర్శరూపము, మహోత్తమమునగు నీప్రేమ తత్త్వము ఇట్టిదని నిర్వచింపజాలము. మానవుని మహోన్నత భావనాశక్తి సైతము ఈ దివ్యప్రేమయొక్క అనంతపరిపూర్ణ సుందరస్వరూపమును గ్రహింపజాలదు. ఏమైనను నికృష్టమగు క్షుద్రోపాసనాదిరూపమునగాని, ఉత్కృష్టమగు భగవద్భక్తిరూపమునగాని ప్రేమతత్త్వావలంబకులగు వారెల్లరు అన్ని దేశములందును తమప్రేమాదర్శమును గ్రహించుటకును నిర్వచించుటకును అసమర్థమగు మానవభాషనే ఇంతవఱకు ఉపయోగింపవలసి యున్నారు. విశేషమేమన, నానావిధములగు మానవప్రేమనే అనిర్వచనీయమగు నీదివ్యప్రేమతో సజాతీయముగా పరిగణించు చున్నారు. మానవుడు దివ్యవిషయములనుగూర్చి స్వీయమానవ సరణి ననుసరించి మాత్రమే చింతింపగల్గును ; నిర్విశేషబ్రహ్మమునుగూర్చి సాపేక్షమగు మనభాషలో మాత్రమే మనకు దెలియనగును. ఈవిశ్వమంతయు నామరూపాత్మక భాషలో

వెలువడుచున్న నామరూపాతీతవిరచితమగు కావ్యము. కావున సామాన్యమగు మానవప్రేమను సూచించు మానవపరిభాషనే భగవద్విషయమునను భగవదుపాసనావిషయమునను భక్తులు ఉపయోగింతురు. పరభక్తినిగూర్చి తెల్పిన మహానీయులు కొందఱు ఈదివ్యప్రేమ ననేకవిధములుగా గ్రహించి యనుభూత మొనర్చుకొన యత్నించియున్నారు. ఈప్రేమయొక్క అతి సామాన్యరూపమును వారు శాంతభక్తి యందురు. జాజ్వల్యమానమగు ప్రేమాగ్ని తనహృదయమున ప్రజ్వలింపని తఱి, దివ్యప్రేమోన్మత్తుడు గానియపుడు, తన భగవదనురాగము కేవల ప్రతీకోపాసనాదులకంటె మాత్రము కొంచెము అధిక మయ్యును గాఢమగు భగవత్ప్రేమోన్మాదరూపమును దాల్పని సమయమున కేవలసామాన్యానురాగయుక్తుడై భక్తుడు భగవంతు నుపాసించునపు డయ్యది శాంతభక్తియని చెప్పబడును. * మెల్లగా జీవయాత్ర సాగింపగోరువారు కొందఱును ఝంఝామారుతము వలె జీవితరంగమునకువచ్చి వెడలువారు కొందఱునై లోకమున నిరుతెఱగుల వ్యక్తు లున్నారు. శాంతమను మాటయే సూచించు నట్లు శాంతభక్తిసాధకుడు నెమ్మదియైనవాడు, ఒడిదుడుకులు లేనివాడు.

ఇంతకంటె ఉన్నతమైనప్రేమ దాస్యభక్తి యనబడును. భక్తుడు తాను భగవత్సేవకుడనని భావించునపు డిది కలుగును. శ్రద్ధాయుక్తుడగు సేవకునకు తన ప్రభునియందుండు ననురాగము దాస్యభక్తునకు ఆదర్శము.

---

* ఉల్లాసము మాత్రమే గోచరించునట్టి భగవత్ప్రీతి శాంతిభక్తిరస మని చెప్పబడును. శాంతభక్తులకు లౌకికవిషయము లన్నిటియందును ఏహ్యాభావ ముండునని గౌడీయవైష్ణవ గ్రంథములలో చెప్పబడియున్నది.

శాంతదాస్యభక్తిరూపములకు దరువాతిది సఖ్యభక్తి— "నీవే నా ప్రియసఖుడవు" అను భావముతో గూడినభక్తి. ప్రియమిత్రునకు మానవుడు తన హృదయము నెట్లు వెల్లడించునో, మఱియు దోషములకు తన్నునిందింపక మిత్రుడు తనకెట్లు సదా సాయమొనర్పయత్నించునో—వేయేల, మిత్రులకు మధ్య నెట్లు సమభావము చెల్వొందునో అట్లే ఉపాసకునకును అతనిప్రియమిత్రుడగు భగవంతునకును పరస్పరప్రేమయు సమభావమును విరాజిల్లుచుండును. భగవాను డిట్లు మనకు మిత్రుడౌను, ప్రాణమిత్రుడౌను. మన జీవితోదంతములనన్నిటిని ఆమిత్రునకు స్వేచ్ఛగా దెలుపవచ్చును; ఆతడు మనకు దోడ్పడునను మహాధైర్యముతో మన పరమరహస్యములను అత్యంత నిర్భయముగా నాతనికి వెల్లడింపవచ్చును. భక్తు డీమిత్రుని మాత్రమే తనయొక్క సమునిగా స్వీకరించును. సఖ్యభక్తిలో నిజముగా భగవానుడు మనచెలికాడు. ఈవిశ్వమున మనమందఱము క్రీడించుచున్నామని చెప్పవచ్చును. బిడ్డ లెట్లు ఆటలాడుకొందురో, మహారాజాధిరాజులును ఎట్లు తమక్రీడావినోదముల దేలియాడుచుందురో, జగన్నాటకసూత్రధారియగు భగవానుడు నట్లే ఈజగముతో క్రీడించుచున్నాడు. ఇది యాతనిలీల. భగవంతుడు నిత్యపరిపూర్ణుడు, సర్వాప్తకాముడునై యుండ నాత డిక సృష్టింపనేల యందురా? మనకుఏదియో లభింపవలయునను కోరికతో మనము కర్మమొనర్చుచుందుము; కోరిక యెప్పుడును అపరిపూర్ణతను సూచించును. భగవంతుడు నిత్యపరిపూర్ణుడు. సర్వాప్తకాముడు. ఐన నాతడు నిరంతరము, ఈసృష్టివ్యాపారమున నిమగ్నుడు కానేల? ఆతని కీసృష్టివలన ప్రయోజనమేమందురా? మన మనుకొను నేదియోయొక ప్రయోజనము

గాఁక భగవంతుడు ఈవిశ్వమును సృష్టించెననుకథలు వట్టి పుక్కిటి పురాణములుకాని మఱియొకటికాదు. నిజముగా భగ వంతుని కిది యంతయు లీల. విశ్వము ఆతనివినోదము. ఈసమస్త ప్రపంచము ఆతనికి ఆనందకరమగు నొకపెద్దవేడుకయై—హాస్యమై—యుండునోవును. నీవు దరిద్రుడవైనయెడల అదియొక వేడుకగా నెంచి యానందింపుము; భాగ్యవంతుడవైనయెడల భాగ్యమబ్బినదను వేడుకతోఁగూడి యానందింపుము; ఆపదలు కలిగెనేని అదియు నొక వేడుకయే; సుఖములు లభించిన, అంతకంటె విశేషమైనవేడుక. ప్రపంచ మొకక్రీడారంగము. ఇందు మనము క్రీడించుచు వినోదించుచున్నాము. భగవంతుడే సంసారమున మనతో క్రీడించుచు వినోదించుచున్నాడు. మనకు ఆతడు నిత్యమిత్రుడు, నిరంతరమైన చెలికాడు. ఆహా! ఆతడెంత చక్కఁగా క్రీడించుచున్నాడో గనుడు! కల్పాంతమున ఆతనిక్రీడ సమాప్తమగును. అల్పకాలమో, అధికకాలమో ఈ క్రీడలో కొంత విరామముండును, మఱల నందఱును వెలువడి క్రీడింప నారంభింతురు. ఇది యంతయు క్రీడయని—భగవల్లీలయని—గుర్తింపమఱచినపుడుమాత్రమే, నీవును ఈక్రీడలో భగవంతునకు దోడ్పడుచున్నావనుసంగతి మఱచినపుడు మాత్రమే ఆపదలను దుఃఖములను అనుభవింతువు; దుఃఖభారముచే నీహృదయము క్రుంగిపోవును; ప్రపంచము ఘోరయాతనానిలయమై నిన్ను వేధించును. కాని యీక్షణికజీవితము, ఈ సంసారము అనిత్యమని—యథార్థముకాదని— జగత్తు మన క్రీడారంగమని—గుర్తించినంతనే మనదుఃఖములు సమసిపోవును. ప్రత్యణువు నందును ఆతడు క్రీడించుచున్నాడు; భూసూర్య చంద్రమండలములను నిర్మించునపు డాతడు క్రీడించుచున్నాడు; సుఖదుఃఖ

నిలయమగు మానవమానసములతో, జంతువులతో, వృక్షములతో, ఆతడు క్రీడించుచున్నాడు. మన మాతని ఆటపాళి యందలి పాచికలము. ఈపాచికల నాతడు ఆటపలకపై బెట్టి కలిపివేయును. మొదట నొకరీతిగను, పిదప మరియొకరీతిగను ఆతడు మనలను నియమించుచున్నాడు.* మన కిది తెలిసినను తెలియకున్నను ఈక్రీడలో ఆతనికి మనము తోడ్పడుచున్నాము. ఆహా! ఏమి బ్రహ్మానందము! మనము జగదీశ్వరుని చెలికాండ్రము గదా!

తరువాతిది వాత్సల్యభక్తి—భగవంతుడు మన తండ్రి యనిగాక, బిడ్డయని ప్రేమించుట. ఇది విచిత్రముగా గాన్పింపవచ్చును; కాని మన భగవద్భావమును అధికారభావవినిర్ముక్తమొనర్చుటలో మనకు దోడ్పడుశిక్షణము ఈ వాత్సల్యభక్తియే. అధికారము భయహేతువు. ప్రేమలో భయము ఉండరాదు. గౌరవమును విధేయతయు శీలనిర్మాణమునకు ఆవశ్యకములయ్యును శీలము సునిర్మితమైనంతనే, ఉపాసకుడు శాంతభక్తిని భక్త్యన్మాదమునుగూడ కొంచెము చవిచూచినంతనే ఇక నాతనికి ధర్మశాస్త్రప్రవచనములును శిక్షాస్మృతులును అనా

* శ్లో. "యత్రానేక క్వచిదపి గృహే తత్ర తిష్ఠ త్యథైకో
యత్రాప్యేక స్తదను బహవ స్తత్ర నైకోఽపిచాన్తే,
ఇత్థం చేమౌ రజనిదివసౌ దోలయ న్ద్వావివాక్షౌ
కాలః కాల్యా భువనఫలకే క్రీడతి ప్రాణిశారైః."

శా. "ఏయింటన్ వసియించుఁ బెక్కు లొకఁ డా యింటం బ్రవర్తించు నే
చాయన్ నిల్చు నొకండు పెక్కు రచటన్ సంధిల్లు నొండైన లే
దా యింటన్ మది నిట్లు రాత్రి దినరూపాక్షద్వయిం జిమ్ముచుం
జేయుం గాలుఁడు క్రీడ లోకఫలకశ్రేణిన్ నృశారంబులన్."

—భర్తృహరి వైరాగ్యశతకము, కాలమహిమానువర్ణనము (42).

వశ్యకములు. భగవానుడు అఖండశక్తిమంతుడనియో, సకలైశ్వర్య సంపన్నుడనియో, అద్వితీయమై భవాన్వితుడనియో, లేక జగదీశ్వరుడనియో భావించుటను తాను ఎంతమాత్రము సహింపనని భక్తుడుపల్కును. భయావహమగు అధికారమును భగవంతునకు అన్వయింపకుండుటకే భక్తుడు ఆతని తన బిడ్డగా భావించి యుపాసించును. పుత్రివాత్సల్యమున తల్లిదండ్రుల కట్టి భయముగాని గౌరవముగాని యుండనేరదుకదా. మఱియు తమ బిడ్డని యనుగ్రహమును బొందవలయునని వారు ఆశింపరు కదా. బిడ్డడు ఎప్పుడును ప్రేమపాత్రుడు ; తల్లిదండ్రులో, తమ బిడ్డనియందలి వాత్సల్యముచే వేయి పర్యాయములైనను తమ శరీరమును సైతము వానికొఱకు సమర్పింతురు. పుత్రివాత్సల్యము ముందు వారికి తమ జీవితములే లెక్కలోనివికావు. కావున భక్తుడు భగవానుని తనబిడ్డయను భావముతో ప్రేమించును. భగవంతునియెడ ఈ వాత్సల్యము అవతారసిద్ధాంతమును విశ్వసించు మతసంప్రదాయములో సహజముగా జనించి వృద్ధినొందును. మహమ్మదీయమతస్థుల కియ్యది అసాధ్యము ; భగవంతునియెడ వాత్సల్యమనినచో వారికి మహాపరాధముగా దోచును, భయముచే శరీరము కంపించును. కాని హైందవులకు బాలకృష్ణుడును, క్రైస్తవులకు బాల జీసస్సు నుండుటచే వాత్సల్యభక్తి వీరికి సులభముగా ననుభూతమగును. హైందవనారీమణులు తఱచు తమ్ము కృష్ణునితల్లిగా భావించుకొనుచుందురు : క్రైస్తవమాతలును ఈ భావమును గైకొని జీసస్సునెడ వాత్సల్యభక్తి నవలంబింపవచ్చును. మఱియు పాశ్చాత్యుల కియ్యది భగవానునియెడ మాతృభావమును గలుగజేయును. నిజముగానే డిది పశ్చిమఖండమున కెంతయో ఆవశ్యకమైయున్నది. భగ

వంతునియెడ భయభక్తులను మూఢవిశ్వాసము మన హృదయములో వ్రేళ్లుపాఱుకొనియున్నది. భగవద్వైభవాతిశయము, భగవదౌన్నత్యము, భగవంతుడనిన హడలుతో గూడిన మన గౌరవప్రపత్తులు మొదలగు మనోభావములను ప్రేమతరంగములచే గడిగివేయుటకు మనకు చాలకాలము పట్టును.*

దివ్యాదర్శప్రేమతత్త్వమున సూచింపబడు మఱియొక భక్తిభావముకలదు. ఇదియే భక్తిపరిభాషచే సూచితమగు సమస్త దివ్యభావములందును ఉత్కృష్టమగు మధురభావము. లోకమున వ్యక్తమగు మహోత్తమ ప్రేమపై మధురభావము ఆధారపడియున్నది. ఇదియే మనకు అనుభవనీయమగు మహోత్కృష్టమైన ప్రేమ. మానవస్వభావము నుఱ్ఱూతలూగించునట్టి ప్రేమ—ఆపాదమస్తకము ప్రత్యణువునందును ప్రవహించునట్టి ప్రేమ—మనుష్యు నున్మత్తుని జేయు, శరీరస్మృతిరహితుని జేయు ప్రేమ—మనుష్యుని దేవతగనో, ఘోరరాక్షసునిగనో పరిణమింపజేయు ప్రేమ—స్త్రీ పురుషులకు ఒండొరులపై గలుగు ప్రేమకు ఎనయగు ప్రేమ మఱేదిగలదు? ఈ దివ్యమధురప్రేమమున జగన్నాథుడే మననాథుడు. మనమందఱము స్త్రీలము; ఈ ప్రపంచమున పురుషులెవ్వరును లేనే లేరు; పరమపురుషుడొక్కడే పురుషుడు, అతడే మన ప్రాణేశ్వరుడు. పురుషుడు స్త్రీయందును, స్త్రీ పురుషునందును జూపు ప్రేమనంతను మధుర భావమునందు భగవానునకు సమర్పింపవలసియున్నది. లోకమున మనకు గాన్పించు బహువిధములగు ప్రేమ కంతకును—దేనితో

---

* ఇక్కాలమున భగవానునియెడ మాతృభావమును వాత్సల్యము నవలంబించి సాక్షాత్కారమును బడసిన మహనీయులలో శ్రీ రామకృష్ణ పరమహంస సుప్రసిద్ధుడు.

మనము కేవలము వినోదించుచున్నామో అట్టి ప్రేమకంతకును —భగవంతుడే పరమావధి ; కాని దురదృష్టవశమున మానవుడీ మహాప్రేమవాహినికి గమ్యస్థానమగు ననంతామృతసాగరము నెఱుంగక మానవులను మట్టిబొమ్మలపై తన ప్రేమను జూప యత్నించును. మానవస్వభావమున శిశువునందు గల బ్రహ్మాండమైన ప్రేమ—అత్యద్భుతమైన ప్రేమ—శిశువను చిన్న లక్క బొమ్మకొఱకు ఉద్దేశింపబడినదికాదు; అంధప్రాయముగా నీప్రేమ నంతను దానిమీదనే లగ్నముచేసినయెడల తుదకు దుఃఖమే నీకు గలుగు ఫలము ; కాని నీయందలిప్రేమను మానవమాత్రునియెడ జూపినచో ఎప్పుడో యొకప్పు డయ్యది దుఃఖజనకము కాక మానదను ప్రబోధము నీకు ఒదవితీరును. ఇదియే ఆ దుఃఖము వలనగలుగు ఫలము. కావున మనప్రేమను మృత్యురహితుడు, నిర్వికారుడు నగు పరాత్పరునకు—నిశ్చలప్రేమసాగరునకు— అర్పింపవలయును. ప్రేమ తన కుచితమగు గమ్యస్థానమును బొందవలయును, అనంతప్రేమసాగరమగు భగవానుని బొంద వలయును. సమస్త నదీనదములును సముద్రమున సంగమించునుగదా. పర్వతప్రాంతమునుండి వచ్చు నుదకబిందువుగూడ ఎంతపెద్దకాలువనుగాని నదినిగాని చేరినంతనే దానిగతి సమాప్తము కానేరదు ; అయ్యది తుదకు సముద్రమున సంగమించి తీరవలయును. మన కామక్రోధాదులకు భగవానుడే పరమావధి.* నీకు కోపపడవలయునని యున్నచో భగవంతునిపై కోపింపుము ; నిందింపవలయునని యున్నచో నీ ప్రియతముడగు భగవానుని

---

* " తదర్పితాఖిలాచారః సన్ కామక్రోధాభిమానాదికం తస్మిన్నేవ కరణీయమ్. "

—నారదభక్తిసూత్రము (65).

నిందింపుము. నిర్భయముగా నిక నెవ్వరిని నిందింపగలవు ? మానవమాత్రుడు నీకోపమును సహింపజాలడు, సహింపడు, వానికి తిరిగి నీమీద కోపమువచ్చును. నామీద నీవు కోపపడిన యెడల వెంటనే అంకులకు ప్రతిక్రియ చేసితీరుదును. నీకోపమును సహించునంతటి ఓరిమి నాయొద్ద లేకుండుటయే యిందులకు కారణము. ప్రియతముడగు భగవానునితో నిట్లనుము : "ఏల నీవు నాయొద్దకు రావురా ? న న్నిట్లేల ఏకాకిని జేసిపోయె దవురా ?" భగవంతునియందుగాక భోగము మఱి యెందున్నది? ఆనందము మఱి యెందున్నది ? క్షుద్రమగు మట్టిబొమ్మలతో మన మేమి భోగము ననుభవింపగలము ? ఆనంద మనుభవింప గలము ? అనంతానంద ఘనస్వరూపమును మన మన్వేషింప వలయును ; అయ్యది భగవంతునియందు మాత్రమే కలదు. మన కామక్రోధాదులన్నిటికిని భగవంతుడే లక్ష్యమగుగాక, భగవంతునికొఱకే యయ్యవి ఉద్దిష్టములై యున్నవి ; లక్ష్యమును తప్పి యవి నికృష్టగాములైనచో దుష్టములగును. లక్ష్యభూత మగు భగవానునివైపుననే ప్రసరించినచో పరమనికృష్టమగు కామముసైతము మార్పుజెంది పవిత్రమగును. మానవమనశ్శరీర శక్తు లెట్లు వ్యక్తమైనను అన్నిటికిని భగవంతుడే పరమావధి. మానవహృదయమందలి సమస్తకామములకును భగవానుడే ప్రాప్యుడు, ప్రియతముడు ; భగవానునికంటె ఈహృదయ మెవ్వరిని ప్రేమింపగలదు ? అతడే దివ్యసుందరుడు, మహనీయుడు ; సుందరమూర్తి, మహనీయమూర్తి. విశ్వమున నాతని మించిన సుందరు లెవ్వరు ? అతనికంటె మనకు వరణీయు లెవ్వరు? అతని మించిన ప్రేమపాత్రు లెవ్వరు ? కావున భగవంతుడే మనకు ప్రియుడగుగాక ! ప్రాణప్రియుడగుగాక. భగవత్ప్రేమమును

కీర్తించు భగవత్కావ్యములు బహువిధములగు మానవప్రేమ యొక్క సాంకేతికరూపములనే తమ భగవత్ప్రేమవర్ణనమునకు అర్థముగా స్వీకరించుచుందురు. అజ్ఞులిద్దానిని గ్రహింపరు, గ్రహింపజాలరు. ఇవ్విషయములను వారెంతసేపు ప్రాపంచిక దృష్టితోడనే చూతురు. ఈ దివ్యప్రేమోన్మత్తత వారికి అవగాహముకాదు, ఎట్లు కాగల్గును ?

శ్లో. "సురతవర్ధనం శోకనాశనం స్వరితవేణునా సుష్ఠుచుమ్బితమ్, ఇతరరాగవిస్మారణం నృణాం వితరవీరన స్తేఽధరామృతమ్." *

ప్రియతముడగు సర్వేశ్వరుని యిట్టి ముద్దు ఆశింపుము ; భక్తు నున్మత్తునిజేయు, మానవుని దేవతగాజేయు, నామహనీయుని యధరచుంబనము నాశింపుము. పరమేశ్వరుని ముద్దు వడయు భాగ్యమబ్బిన, పరమేశ్వర చుంబనముచే ధన్యుడైన వానికి విశ్వప్రకృతి పరిపూర్ణముగా మాఱిపోవును, సూర్యచంద్ర సహితముగా లోకము అదృశ్యమగును. ఆ యనంతాద్వితీయ ప్రేమసాగరమున విశ్వ మంతయు లీనమైపోవును. దివ్యప్రేమోన్మాదమున కిదియే చరమావస్థ—చరమావస్థయైననేల—నిజమగు భక్తున కిదియు తృప్తికరముకాదని చెప్పవలయును ; భార్యాభర్తలయన్యోన్యప్రేమకూడ ఆతనిదృష్టిలో ప్రేమోన్మత్తతకు జాలదు. వేయేల, భక్తులు వ్యభిచారులయొక్క ప్రేమమును సహితము ఆదర్శముగా గైకొందురు; ఎలన, అది యంత బలీయముగా నుండును ; అప్రేమయందలి అయుక్తత వారికి ఎంత

---

* ఆ. "సురతవర్ధనంబు శోకాపహరణంబు, స్వరితవంశనాళసంగతంబు, నన్యరాగజయమునైన నీమధురాధ, రామృతమునఁ జూప మార్పుమీశ !" —భాగవతము, గోపికాగీతలు (10-1049).

మాత్రము లక్ష్యభూతముకాదు. స్వేచ్ఛగా ప్రసరించుటకెన్ని యాటంకములు కలిగిన అంతదృఢమగుచుండుట యాప్రేమ యొక్కనైజము. భార్యాభర్తల పరస్పరానురాగమున ఒడిదుడుకు లుండవు ; ఆటంకములు కలుగవు ; కావున అది సరళముగా నడుచుచుండును. యువతి యొకని వలచినపుడు ఆమె తల్లిదండ్రులో, భర్తయో అట్టిప్రేమకు ఆటంకము గల్గించుచుండుట నామెప్రేమ మఱింత బలీయమగుచుండునుగదా. భక్తుడు ఈమనోభావము నాదర్శముగా గొనును. బృందావనమున గోపికలు శ్రీకృష్ణు నెట్లు ప్రేమించిరో, ఆ ధన్యురాండ్రు ఎటు లాతనివేణుగానమును వినినంతనే సమస్తము మఱచి, సంసారమును, సంసారబంధములను, సుఖదుఃఖములను, విధులను, సమస్తముమఱచి కృష్ణుని గలిసికొనుటకై యిలువీడి పరుగెత్తిరో మానవభాష వర్ణింపజాలదు. ఓయీ ! మానవుడా ! భగవద్భక్తినిగూర్చి నీవు ప్రసంగింతువే ! తోడ్తోడనే ఈమాయా సంసారబంధముల నన్నిటిని పైపై చుకొనుచున్నావే ! నీవు నిష్కపటచిత్తుడవేనా ?

"జహాఁ రామ తహాఁ కామ నహీం, జహాఁ కామ తహాఁ నహీంరామ : దో నోఁ ఏక సాథ మిలత నహీం రవిరజనీ ఏకఠామ." *

"రాము డేలు హృదయమున కాముడును కాము డేలు హృదయమున రాముడు నుండజాలరు ! సూర్యతేజమును చీకటియు నొక్కచోనుండజాలవు కదా !"

---

* తులసీదాసకృతి.

### పర్యవసానము

ఈయుత్కృష్టభక్త్యాదర్శమును ప్రాపించునపుడు వేదాంతము త్రోసిరాజగును ; అపుడు నీ వేదాంతము ఎవరికి గావలయును ! స్వాతంత్ర్యము, మోక్షము, నిర్వాణము—సమస్తము తృణీకరింపబడును. భగవత్ప్రేమానందమున దేలియాడునపుడు ముక్తిని కాంక్షించు వా రెవ్వరు ?

శ్లో. "నధనం నజనం నసున్దరీం కవితాం వా జగదీశ కామయే
మమజన్మని జన్మనీశ్వరే భవతా ద్భక్తి రహైతుకీత్వయి."*

"జగదీశ్వరా ! నాకు ధనము వలదు, జనము వలదు, సుందరులువలదు, కవిత్వము వలదు, జన్మజన్మాంతరములందు నీయందలి అహేతుకభక్తియే నాకు వలయునది." భక్తుడిట్లు పల్కును : "తాను పంచదారను కావలయునని యెవ్వడు వాంఛించును ! పంచదారను నేను రుచిచూడదలంతును."† అట్టిచో ముక్తుడై భగవంతునితో నైక్యము నొందగోరు భక్తు డెవ్వడు ? "అపరమాత్మయే నే నని గ్రహించియుందునుగాక, ఐనను నాప్రియతముడగు పరమేశ్వరుని సంసర్గ మనుభవించుటకై ఆ పరమాత్మనుండి విడివడియెదను." ఇదియే భక్తుని యభిప్రాయము. అహేతుక భగవత్ప్రేమయే భక్తునకు అభీష్టము, ఆనందప్రదము. తన ప్రియతముని సాన్నిధ్య మనుభవించుటకై వేయిపర్యాయములైనను బద్ధుడై యుండనివా డెవ్వడు ! భక్తునకు భగవత్ప్రేమకంటె, భగవంతుని వలచి వలపించుకొనుట కంటె వాంఛనీయము వేఱొండులేదు. భక్తునిప్రేమ సముద్ర

* శ్రీకృష్ణచైతన్యవిరచితము, శిక్షాష్టకము (4).
† శ్రీ రామప్రసాదసేను.

గామియగు నదియందలి పోటువంటిది. భక్తుడు ప్రేమప్రవాహమున కెదురీదును. లోకమాతని పిచ్చివాడనును, లోకులు పిచ్చివా డనిన రొకమహనీయుని నే నెఱుగుదును. అందుల కాతనిసమాధాన మిది : "మిత్రులారా! ఈప్రపంచమంతయు నొక యున్మత్తశరణాలయము. ఇందు దారాపుత్త్రులకై కొందఱు, పేరుప్రఖ్యాతులకై మఱికొందఱు, స్వర్గమునకై ఇక గొందఱు పిచ్చియెత్తినది. ఈ పెద్ద యున్మత్తశరణాలయములో నేనును ఒక పిచ్చివాడనే, భగవంతుని బొందవలయునని నాపిచ్చి, డబ్బుకొఱకు మీకు మతిపోయినయెడల భగవంతునికొఱకు నాకు మతిపోయినది. మీరును పిచ్చివారలే, నేనును పిచ్చివాడనే. ఐనను నాపిచ్చి నన్నిటిలో ఉత్తమముగా నెంతును."* ఇట్టి దివ్యోన్మత్తతయే భక్తునిప్రేమ. విశ్వమాతనికి ప్రేమనిలయమై ప్రేమస్వరూపమై—తోచును. మానవు డిట్టి దివ్యప్రేమను బడసినచో ధన్యుడై శాశ్వతానందమూర్తియగును. ఈదివ్య ప్రేమోన్మాద మొక్కటియే మనయందలి భవరోగమును శాశ్వతముగా మాన్పును. స్వార్థపరత్వముతోగూడ భక్తునికామము అంతరించును. భగవత్సన్నిహితుడై భక్తు డింతకుమునుపు తన కుండిన వ్యర్థవాంఛలనన్నిటిని ఒక్కుమ్మడి త్యజించివేయును.

భక్తిసాధనను మనముఎల్లరము ద్వైతభావముతో నారంభింపవలసియున్నది. అట్టియెడ భగవంతుడు వేఱనియు మన మందఱము ప్రత్యేకవ్యక్తులమనియు దోచును. అంతట మానవునకు భగవానినిపై ప్రేమ ముప్పతిల్లును ; అంత నాతడు భగవానుని సమీపింప మొదలిడును, భగవానుడు మానవునకు అత్యంతసన్నిహితుడు కాదొడంగును; అవుడు పితృమాతృసుత

* శ్రీ రామకృష్ణపరమహంస.

హితాది జీవితసంబంధముల నన్నిటిని గైకొని భక్తుడు తన ప్రేమ లక్ష్యమగు భగవానునియందు వ్యక్తమొనర్చును. భక్తుడు ఈ రూపము లన్నిటను భగవానుడు వెలసియుండుట గాంచును. సాధకుడు తన యుపాస్యమున తా నెపుడు సంపూర్ణముగా లీనమై భగవదనుభవమునొందునో అపుడు భక్తిసాధనక్రమమందలి చరమస్థితిని ప్రాపించును. క్షుద్రమగు మన యహంకారమమ కారములు అన్యాయముగా మనప్రేమను స్వార్థపరమొనర్చు చుండును. తుదకు ఎట్లో ఉజ్జ్వలప్రేమప్రకాశమును గందుము; ఆ తేజమున మన యల్పజీవాత్మ అఖండసచ్చిదానందస్వరూపమై యొప్పు పరమాత్మతో నైక్యమొందును. ఈప్రేమజ్యోతి వెలుంగున మానవుడు పరిపూర్ణపరిణామమునొంది తుదకు భక్తుడు, భగవానుడు, భక్తి యను తత్త్వత్రయమొక్కటే యను దివ్య సుందర సత్యమును గ్రహించుచున్నాడు.

ఓం తత్సత్

శ్రీ రామకృష్ణార్పణ మస్తు !

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు



| | | |
|---|---|---|
| వివేకానంద జీవితచరిత్ర | ... | 2- 4-0 |
| శ్రీ శారదాదేవి చరిత్ర | ... | 1-14-0 |
| నాగమహాశయుని జీవితచరిత్ర | ... | 0-12-0 |
| రాజయోగము (మూడవకూర్పు) | ... | 2- 4-0 |
| కర్మయోగము (రెండవకూర్పు) | ... | 1- 0-0 |
| భక్తియోగము (మూడవకూర్పు) | ... | 1- 0-0 |
| శ్రీ రామకృష్ణబోధామృతము (8-వ కూర్పు సాదాప్రతి) | ... | 2- 4-0 |
| ,, ,, (అట్టబైండు) | ... | 2-12-0 |
| శ్రీ మద్భగవద్గీత (అట్టబైండు) | ... | 2- 8-0 |
| గురూపదేశములు (నాల్గవకూర్పు) | ... | 0- 8-0 |
| నీతికథారత్నములు | ... | 0- 8-0 |
| జీవితోపదేశ సంగ్రహము | ... | 0- 4-0 |
| నాగురుదేవుడు (రెండవకూర్పు) | ... | 0- 6-0 |
| సందేశామృతము (రెండవకూర్పు) | ... | 0- 6-0 |
| నాయుద్యమపద్ధతి | ... | 0- 3-0 |
| ముక్తిమార్గము | ... | 0- 2-0 |
| సర్వం విష్ణుమయంజగత్ (తెలుగు) | ... | 0- 2-0 |
| శ్రీ వివేకానంద సింహగర్జన అ. ½, 12 ప్రతులు | ... | 0- 5-0 |
| భారతదేశ పునరుద్ధారణ అ½, 12 ప్రతులు | ... | 0- 5-0 |

---

# శ్రీ రామకృష్ణ ప్రభ

(1944 జూలై నుండి వెలువడుచున్నది)

ఆధ్యాత్మిక విషయకమగు మాసపత్రిక. ప్రతినెల 20 వ తారీఖున వెలువడుచుండును. సం॥ చందా రూ. 3 లు

పోష్టుఖర్చులు వేరు—వివరములుగల కేటలాగు ఉచితము, వలయువారు ఇట్లు వ్రాయవలెను.

మేనేజరు: శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు.